# వీరసేనుడు

(ఒథెల్లో)



ప్రకాశకులు:
సుందరరాం అండ్ సన్సు
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు
తెనాలి.

వలయువారు! —

చావలి లక్ష్మీనారాయణ బి ఏ, బి. ఇడి.,

పొన్నూరు, [గుంటూరు జిల్లా]

# వీరసేనుడు

( ఒ థె ల్లో )



రచయిత:

విద్వాన్: చావలి లక్ష్మీనారాయణ బి. ఏ., బి. ఇడి.,



వెల: 1 4 0.

# తొలిపలుకు

ఇది షేక్స్పియర్ వ్రాసిన "ఒథెల్లో" అను ఆంగ్ల నాటకమునకు అనువాదము. పాత్రలు, స్థలములు దేశీయులుగా మార్చబడినవి. మతాచార సందర్భములలో జాతీయముగా స్వతంత్రరచనలు చేయబడినవి. అట్టివి కొన్నియే.

కథ:— ధాన్యకటక ప్రభువునొద్ద, కృష్ణరాజు మంత్రిగను, వీరసేనుడు సేనానిగను ఉండిరి. సేనానికి క్రింది ఉద్యోగి దండనాథుడు. దండనాథునిపదవి ఒకటి ఖాళీవచ్చెను. సేనానికి కార్యదర్శియగు మేధావి అనువాడు ఆ పదవికి యత్నించెను. కాని, వీరసేనుడు ఆ పదవిని సత్యకుడనువానికిచ్చెను. అందుచే వీరసేనునిపై మేధావి పగబట్టియుండెను.

సౌందర్యవతియగు, మంత్రిపుత్రిక పద్మాదేవి, నల్లనివాడైనను సేనానిని, తండ్రికి తెలియకుండ వరించెను. నరేశము అనువాడు, ఆమెనదివరకే మోహించెను. సంబంధము కుదురునని మొదటను, తార్చెదనని పద్మా వివాహానంతరమునను, నరేశమును ఊరించి, మేధావి వానివద్ద లంచములు గొట్టెను. సత్యకునిచే మేధావి ఒకరాత్రి త్రాగించెను. సత్యకునిఆజ్ఞనుల్లంఘింపుమని నరేశమును పంపెను. వారు కొట్టుకొనునపుడు సత్యకుడు త్రాగినాడని ఋజువుచేసి, మేధావి వానిని ఉద్యోగమునుండి ఊడబెరికించెను. తిరిగి ఆపదవినిపొందుటకు పద్మాదేవిని ఆశ్రయింపుమని సత్యకునకు జెప్పెను. అతడామె నాశ్రయించునపుడు, వీరసేనునకుజూపి, వారిద్దరకు, సంబంధమున్నదని వీరసేనునకు జెప్పెను. తనభార్యయగు నీలాంబరిచే సేనాని చేతి రుమాలును మేధావి తెప్పించి, అది సత్యకునకు దొరకునట్లు చేసి, అది వానిచేతిలోనుండగా వీరసేనునకుజూపెను. వీరసేనుడు ఇదినమ్మి తనభార్యను చంపెను. నీలాంబరి యథార్థము బయటపెట్టినప్పుడు వీరసేనుడు పొడుచుకొని చచ్చెను.

# ప్రధానపాత్రలు

| | | |
|---|---|---|
| 1. | ధాన్యకటకపురాజు | Duke of Venice |
| 2. | కృష్ణరాజు (మంత్రి) | Brabantio |
| 3. | సౌవర్ణి–కృష్ణరాజుతమ్ముడు | Gratiano |
| 4. | విజయమూర్తి | Kinsman to Brabantio |
| 5. | వీరసేనుడు–సేనాని–పాండ్యుడు | Othello-, a Moor |
| 6. | సత్యకుడు– సేనానికిదండనాథుడు | Cassio-, lieutenant |
| 7. | మేధావి–సేనానికి మహా మాత్రుడు–(కార్యసహాయుడు) | Iago-his Ancient |
| 8. | నరేశము–ఒకపౌరుడు | Roderigo-a Venetian Gentleman |
| 9. | రామరాయలు– సుమిత్రాపాలకుడు | Montano, Governor of Cyprus |
| 10. | పద్మాదేవి–కృష్ణరాజుపుత్రిక– వీరసేనునిభార్య | Desdemona, daughter of Brabantio and wife to Othello |
| 11. | నీలాంబరి–మేధావిభార్య– | Emilia, wfie to Iago |
| 12. | నాగమణి– సత్యకుని ఉంపుడుగత్తె | Bianca, Mistress to Cassio |

రంగములు:—

| | | |
|---|---|---|
| 1. | ధాన్యకటకము | Venice |
| 2. | సుమిత్రా రేవుపట్టణము | A seaport in Cyprus |

# వీ ర సే నుఁ డు

[ప్రథమాంకము]

ఒ క ట వ ర ం గ ము

ధాన్యకటకపువీధి

అర్ధరాత్రము

ప్రవేశము మేధావీ, నటేశులు.

నటే:- సరేలే,సరేలే—ఇక చెప్పకు—నాసామ్మ్య నీబాబుది వలె వాడుకొనికూడ, నీవు, మేధావీ! ఇది ఎరుగనట్లు దాచి యుంచితివే!— ఎంత మిత్రద్రోహము!

మే:- అబ్బబ్బ!నామాట జొరనీయవు. దైవసాక్షిగ, అట్టిది కలలోనైనను ఊహించినచో, నోరికివచ్చినట్లు తిట్టు.

నటే:- అతడన్న బొత్తుగ గిట్టదంటివే ?

మే:- కానిచో నన్ను ఛీయనుము. ఈ పురప్రముఖులు ముగ్గురు నన్ను తన దండనాథునిజేయుమని సలాములుగొట్టిరి. అంతరాత్మసాక్షిగ నా విలువ నాకే తెలియును. అంతకు తక్కువ పదవి మనకు తగదు. కాని తన పదవికి మురిసికొనుటతో ఇంకొకటి చెవిబెట్టని ఆ చెడిబ్రతికిన గరువబోతు, యుద్ధపరిభాషతో గోరంతలు కొండంతలుగా డంబములుగొట్టి వారికి సున్నజుట్టెను. నాయుద్యోగి నెన్నడో నియమించితినని యట అతని సమాధానము. ఎవరందు వేమో! సౌరాష్ట్రుడగు

ఒక సత్యక మహాశయుడు. గణితశాస్త్రమున మాత్రము పెద్ద చేయి. పెండ్లి అక్కరలేని రసికుడు. క్రియకుగాని వాగుడే వాని కున్న శౌర్యము. అట్టివానికి మహాపదవి. ఇక తన కనులగట్టి నట్లు సుమిత్రాది వివిధ ప్రదేశములలో అపారవీర్యము జూపిన నాకు ఈచవట వెనుక ఒదిగిళ్ళా? ఈ అభోజిగుడు తరుణములో అతనికి దండనాధుడును, – దైవమే పాలించుగాక,– నేను, ఆ పాండ్యప్రభునకు మహామాత్రుడనా?

నటే:– వానిని నటికినను పాపములేదు.

మే:– ఎందుకు? ఆపద్గతికి తిరుగేలేదు. అదే సేవా వృత్తిలోని పెద్దభోగము. పదవిలోనివృద్ధి, అండచేతను ప్రేమ చేతనేగాని వసుప్రకారము రావలెనన్న పాత ఫక్కినిమాత్రము కాదు. ఇదిగో అసలు నాకు పాండ్యుని ప్రేమింపవలసిన బాధ్యత ఏమున్నదో నీవే చూచుకో.

నటే:– అయితే అతని వెంటరాను.

మే:– అదే పనికిరాదు. నేనుపోవుటగూడ, వానితో నాపనులు కావలసి. అందఱకు పదవు లెచటినుండి వచ్చును? వచ్చినవారికిమాత్రము సరియగు గౌరవము గలదా? ఒక్కటి విను—

తే॥ గ్రాసమాత్రమ్మునకె చాకి గాడిదవలె
శక్తిమించిన తుచ్ఛదాస్యమ్ము ప్రియత
సలుప, ముదిసిననాడు విశ్వాసమెల్ల
తలగి గెంటరె నిక్కంపు దాసజనుల.

అట్టి యదార్థపు దేబెలను నఱికినను పాపములేదు. మఱొక తెగ వారు స్వామిభక్తి ఒడలంతేయు బూసికొని మనోవృత్తులు స్వార్థముననే నిలిపి దొరలకు నక్కవినయములను జూపుచు వారివలన పుంజుబొఱి తెక్కలు వచ్చినమీాద పోషకులను మరచు కోకిల లగుదురు. వీరికే బుద్ధిఅనునది కద్దు. వింటివా మిత్రమా!- అట్టివారిలో మేటినని గ్రుద్దిచెప్పుచున్నాను. పాండ్యు నాశ్రయించుటనగా నన్నాశ్రయించుకొనుటే. అది ప్రేమతో కాదనుటకు దైవమే సాక్షి. అట్లగపడుచు నా ప్రత్యేకాశయము కొఱకు. నాపైచర్యలనుబట్టి, నామనస్స్వరూపమునగోచరించునట్లు ప్రవర్తించితినా, నాహృదయమును కాకులకు దొండపండును చేసినట్లే. ఇంతెందుకు ? ఈ కనిపించునేను నేనుగాను.

నటే:- అతనిపని నెగ్గినచో ఆ మొద్దు పెదవులకెంత అదృష్టము ?

మే:- దానితండ్రిని కేకలుబెట్టిలేపు. వానిని వీధిలో బెట్టి దానివారిని రేకొట్టు; పాండ్యుడెట్టి ఆనందాబ్ధిలోనున్నను అందు విషముపుట్టించి వానిచావునకు తెచ్చిపెట్టు.

నటే:- ఇదే దాని తండ్రి ఇల్లు. కేకలు బెట్టుదునా ?

మే:- నిశాప్రమత్తతచే నగరము తగులబడుచుండ ఉలికి పడిచూచి చేయు భీకర గద్గదరోదన స్వరముతోవలె బెట్టుము.

నటే:- హా ప్రభూ! రాజా! ఎవరో!

మే:- దొంగలు దొంగలు- బాబోదొంగలు- మీాఇల్లు- పుత్రిక-సంచులు-హాదొంగలు. దొంగలు!

పై కిటికీవద్ద ప్రవేశము కృష్ణరాజు.

కృష్ణ:- ఎందుకీ బొబ్బలు? ఏమిటక్కడ?

నటే:- ఆర్యా! మీవారందరింటిలో నున్నారా?

మే:- మీ తలుపులు వేసియే యున్నవా?

కృష్ణ:- ఎందుకని? ఏమీప్రశ్నలు?

మే:- కాదుబాబూ! మీకొంప దోచిరి. దుస్తుల దగుల్చుకొనుడు, ప్రభూ! అందఱను గంటకొట్టి లేపుడు. విన్నచో మీఁగుండె బ్రద్దలగును. మీ ఆత్మలో సగమెగిరిపోయి నది. బయలుదేరవలె ముందు!

కృష్ణ:- నీకు మతిపోయినదా ఏమి?

నటే:- దేవర నాకంఠధ్వనిని గుర్తించిరా?

కృష్ణ:- లేదు—ఎవరవు?

నటే:- నటే—,

కృష్ణ:- వెళ్ళు ముందు. నాగడప త్రొక్కవద్దని బుద్ధి జెప్పలేదా నీకు? స్పష్టముగా దెలిపితినిగానా నాపుత్రిక నీకు గాదని? ఇపుడు తప్పత్రాగి దౌర్జన్యముతో అల్లరి చేయ వచ్చితివిరా?

నటే:- కాదు. కాదు. వినుడు.

కృష్ణ:- జాగ్రత! నేనెవరనో తెలియునా?

నటే:- ప్రభూ! నిదానింపుడు.

కృష్ణ:- ఏమిటి? దోపిడనియా? అడివిలో దిక్కులేని ఒంటరిగుడిసెగాదు నాయిల్లు.

నటే:- ఆర్యమహాశయ! నిర్మలమగు వినయబుద్ధితో వచ్చితిని.

మే:- విరోధి చెప్పినాడుగావున దేవుని పూజింపగూడ గనువారిలో నొకడవు.

కృష్ణ:- నీవొక తుచ్ఛుడవు.

మే:- మీరే మహామాంత్రికులు.

కృష్ణ:- ఆ? నిన్నెరుగుదునురా నటేశ!

నటే:- ఆర్య! దేనికైనను బద్ధుడనే. కాని-, మీ కుమారీమణి దిక్కులేని ఈ అర్ధరాత్రమున డబ్బుకు ఱెక్కలమ్ముకొను దేశదిమ్మరి, యావలమారి, అగు పాండ్యునకై మురిసి లేచిపోవుట తమరెఱిగి తమయిష్టముమీద నే జరిగినచో,- కొంతవరకట్లే తోచుచున్నది-, మీయెడ తెగించి పెంకెగా మహాపరాధము చేసినవాడనే. కాని మీకీగొడవయే తెలియనిచో, మీ నిష్కారణ నిందకు పాలైతినని నా అంతరాత్మ క్షోభిల్లుచున్నది. మీఅంతవారితో ఇట్టి విషయములో అవివేకముగ పరాచకము లాడుదునని ఎన్నడు తలపకుడు. కాని మఱల చెప్పుచున్నాను. మీపుత్రి మీసమ్మతిన కాకుండినచో- తన మాన, ప్రాణ, వయో రూపములు-, నిముసముగూడ నిలుకులేని పరాయి తిరుగుబోతునకు అర్పించి మిమ్ము కడు హేయముగ ధిక్కరించినది. కాని ఒక్కటే శపథము. ఇపుడు మీ

దేవి మీాసాధమందేడుండి నేను మిమ్మిట్లూరకె ఉడికించినచో ఎట్టి తీవ్రశిక్షలకైనను బాధ్యుడనే.

కృష్ణ:- ఎవడురా! దీపములు. నాకొకటి. మనవారిని లేపుడు. వచ్చిన కలకిది సరిపోయినది. దీపము! దీపము!

(పైన నిష్క్రమణము)

మే:- సెలవు. ఇక నీదగ్గర నుండగూడదు. పాండ్యునకు వ్యతిరేకముగ బయటపడుట-ఇంకను మసలినచో పడితీరెదను- నాస్థానమునకును మర్యాదకును మంచిదికాదు. ఏమందువా? తన కార్యనిర్వహణమునకు అంతటి సమర్ధుడగు యోధుడు మఱొకడు లేకుండుటచే, ప్రస్తుత సుమిత్రాయుద్ధముల కతనినే పంపవలెగాన, ఈతప్పిద మెంతదైనను ప్రభుత్వమతనిని మంద లించునేగాని తొలగించిమాత్రము సుఖపడనేరదని నాకు గట్టిగ తెలియును. ఇట్టివానిలో, విషసర్పమువలె అతడు నాకు గిట్ట కున్నను నాప్రస్తుతస్థితినిబట్టి నామమాత్రమునకైనను ఆగోడు గునేపట్టి ఆపాటనే పాడవలె. కృష్ణరాజు నాకంఠమునీదను కొన్నాడు. పాండ్యునవశ్యము కనుగొన వీలగునట్లు ఆ కోపపు వెతకులాటను ఆయుధశాలవంకకునడపు. అచట పాండ్యుతో నుండును సెలవు.

(నిష్క్రమణము)

ప్రవేశము కరదీపికలతో కృష్ణరాజు.

కృష్ణ:- హా ఎంత ఘోరము—పోయినదిగా? ఎంతలోమారి నది నాగతి? అయితే ఎచటచూచితివి నరేశ? హా నిర్భాగ్యు

రాల! పాండ్యుతో ననియెనా నీచెప్పునది? ఇక తండ్రినని ప్రపంచమున నెవడుచెప్పుకొనును? దేవియే అని నీకెట్లునమ్మకము? చిత్రముగ మోసగించిన దే! ఏమైనా అన్నదానితో? ఇంకను దీపములు? మనవారినిలేపుడు. వారి వివాహములై యుండు ననియే అనుకొందువా?

నళే:- ఆ-ఈపాటి కై యుండుననియే నాయూహ.

కృష్ణ:- హా-దైవమా! బయటికెట్లుపోయెదనోగదా! నారక్తమాంసములే నాకెదురుతిరుగుటా? తండ్రులారా? ఇక నుండి మాపుత్రికల పైచర్యలబట్టి, బుద్ధులను నమ్మకుడు. కన్యల యౌవనసంపదను కళంకపఱచు నైంద్రజాలములుండవా నళేశ? అట్టివున్నట్లు జరగినట్లు ఎచటను వినలేదా?

నళే:- యథార్థముగా ప్రభూ. ఎన్నోచోట్ల.

కృష్ణ:- నాతమ్ముని బిలువుడు—నీకైనను బాగుండేదది నళేశ! అయితే వారినందఱ నెచట పట్టవచ్చునో ఆచూకి తీయగలవా?

నళే:- తమరు దయచేసి తగినంత స్తోమతుతో రావలెనేగాని వారిని పట్టవచ్చుననియే నాధైర్యము.

కృష్ణ:- జాగుసేయక ముందునడువు. ఇంటింటను పిలుతును. నామాటకు కాదనరు. ఆయుధములు! ఎవరక్కడ? కావలివారలలేపుడు. పద మిత్రమా? నీకష్టముంచుకోను.

[నిష్క్రమణము]

# వీ ర సే ను డు .

## అంకము 1. రంగము 2.

### మహాలోకవీధి.

(ప్రవేశము, కరదీపికలతో మేధావి, వీరసేనుడు, పరిచారకులు-

మే:-

ఆ॥ వృత్తి ధర్మమనుసరించి యొందఱైన
యుద్ధమందు జంపు టొప్పుగాని
కృత్రిమంపు హత్య, కేవలపాపమ
టంచు నాదు నిశ్చయమ్ము దేవ !

చాలసారు లా రాజును ఈ చిఱుడొక్కఁన పొడువబోయికూడ ఛీయని విరమించితి.

వీర:- మంచిపనిచేసితివి.

మే:- కాదు—చీమునెత్తురులు చంపుకొన్న జడభరతుడనుగాను గనుక, ఆతడు తమనఁగూర్చి ప్రేలిన నిందాగర్భములను కడుప్రయాసముపై సహింపగల్గితిని. కాని ఒకటి అడుగుచుంటిని. వెంటనే అయినదా మీవివాహము ? ఆమహామహునకు జనానురాగముమెండు. మీదుమిక్కిలి ప్రభునకంటెగూడ గాటుగల పలుకుబడి గలదు. ఇంతవరకు శాసనముకాని విడాకులచట్టమును ఈ చాణుక్యుడు శాసనముచేయించి మీవివాహచ్ఛేదమునుకూడ చేయింపగలడు. లేదా—, తన కసినిజూపుటకు వీలైనంతవరకు చట్టమును సర్వశక్తుల మీపై ప్రయోగించితీరును.

వీర:- వాని అక్కసునంతను జూపనిమ్ము. నేజేసిన సేవయే వాని మొఱకు వాగ్బంధముచేయును. అవసరమునకు

పొగడుకొనుట దోషముకాదుగనుక, మేధావీ!—నేను రాజ వంశములోనే పుట్టి పెరిగితిననియు, గర్వింపదగు నీ యదృష్టము నాకు లభించుటకుమూలము తామేనని నా ఉత్తమగుణములే చాటుచున్నవనియు, చెప్పుకొనవలసియుండును-

ఉ|| దేవిని ప్రాణతుల్యగ నతీతగగూడ దలంపకున్న, నై
రావత వాహుభోగము కరమ్మున బెట్టినగూడ, నేను, నా
స్థావరమే యెరుంగ కనిశమ్మును స్వేచ్ఛజరించు జీవితం
బావరణా నిబద్ధ మెపుడైన నొనర్చియెయుంటినో సఖా.

అటు చూడు! వెలుతురగ పడుచున్నది దూరమున-

మే:- వారా? మండిపడు తండ్రియు వానిమిత్రులును-మీరు లోనికేగుటమంచిది-

వీర:- పోను. నాసుగుణములే నన్ను శుద్ధముగ ప్రదర్శింపవలె. వారేనా?

మే:- కానట్లున్నది.

(ప్రవేశము, కరదీపికలతో సత్యకుడును అధికారులు.)

వీర:- నా దండనాథుడును రాజభటులును!- నమస్తే! సత్యక! విశేషమేమి?

సత్యః- ప్రభువు మిమ్మభినందించి సేనానీ! తత్ క్షణమే ఈ యున్నట్లుగావచ్చి తన్ను దర్శింపగోరుచున్నాడు.

వీర:- ఎందుకో?

సత్య:- ఏదో సుమిత్రానుండి అని తోచుచున్నది. అది మహావశ్యక కార్యము. నౌకాధికారు లొకరివెంట నొకరిగా పదుగుర వార్తాహరులను తరిమిరి. సభ్యులు పెక్కురు మేల్కొనిరి-పరిషత్తు సమావేశమగుచున్నది. మిమ్ము వెంటనే పిలిచిరి. ఒసగో లేనందున ప్రభువుమీకై పురమంతయుగాలింప మూడుజట్లుగా పెక్కండ్రు చారులపంపెను.

వీర:- నేను మీకే అగపడుట అదృష్టము. లోనికేగి ఒకేమాట చెప్పివత్తును- (పోవును)

సత్య:- లోన వీనికేమిపని మేధావీ!

మే:-

తే॥ నేటి రేయిన నొకవజ్రపేటి పడియె
నతని బారిని న్యాయ సమ్మతమటంచు
నది నిరూపితమాయెడ నధిక వైభ
వాత్తుడగు నెప్పటికిగాగ నాతడిపుడె.

సత్య:- నాకర్థ మగుటలేదు.

మే:- అతడు వివాహమాడెను.

సత్య:- ఎవరిని ?

మే:- ఎవరినా ? (ప్రవేశము వీరసేనుడు) గండు సేనాని పోదమా ?

వీర:- ఇక మీఅధీనము.

సత్య:- మఱొకదండు మిమ్ము వెదుకవచ్చుచున్నది.

మే:- కృష్ణరాజు ఆవచ్చునది. జాగ్రతగా నుండుడు సేనానీ! ద్రోహబుద్ధితో వచ్చుచున్నాడు.

ప్రవేశము ఆయుధములు, కరదీపికలతో కృష్ణరాజు, నరేశము, అధికారులు.

వీర:- హాం! నిలువుడక్కడ.

నరే:- దేవా! వాడే పాండ్యుడు.

కృష్ణ:- పట్టుడు దొంగను. (అందరు కత్తులు దూయుదురు).

మే:- అరే నరేశ! నీకు నేనుంటినిరా-

వీర:- మీ మెఱుగుకత్తులు ముడిచిపెట్టుడు. అవి మంచున త్రుప్పుపట్టును. ఆర్యమహాశయ! తమ రాయుధములచేకంటె వయసుచే ఎక్కువ గౌరవ మొందగలరు.

కృష్ణ:- ఓరీ తుచ్ఛపుదొంగ! ఎచటదాచితివిరా నా పుత్రిని? నీవు చెడ్డదిగాక దానినికూడ ఎంతచేసితివిరా? నాకుజూడ నేవశీకరణమునగో కట్టుబడనిచో మృదుల స్వభావ; చక్కనిచుక్క అగు నాముద్దులతల్లి మాజాతి ఆగరభ శ్రీమంతులగు సుందరమూర్తుల నెందరనో తృణీకరించినదాని విరుద్ధముగ-అందరునవ్వునట్లు-తన రక్షకస్థానమునుండి ఈనల్లని పరాయిపిశాచమునొద్దకు ఆనందించుటకుగాక-ఉలికిపడుటకో పరుగెత్తునా? తుచ్ఛమంత్ర ప్రయోగముచే, మతులను భ్రమపెట్టు మందుమాకులచే, దాని నవయౌవనము కళంకపరచితి

వని తోచినంతనే ఒడలు ఝల్లుమనదేమో లోకమే నిర్ణయింప వలె. ఇది ప్రభుత్వమునెదుట బెట్టెద. ఇట్టి ఇంద్రజాలముచే ఇంకను ఎమిచేయుదువో అని గుండెలవియుచున్నవి. వానిని బంధించుడు. ఎదిర్చినచో చావమోదిదంచుడు.

వీర:- నాఆధీనులగువారును ఇతరులునుకూడ చేతులు కట్టుకొనుడు. ఇపుడీరంగమున వంతునాదియే అగుచో ఒకరందింపనే అక్కరలేదు. మీ అభియోగమునకు సమాధాన మిచ్చుటకు నేనెక్కడకు రావలెనని ఆర్య ?

కృష్ణ:- చెరసాలకు- సకాలమున సమాధానమిచ్చుటకు న్యాయస్థానము నిన్ను పిలుచువరకు—

వీర:- పోనిండు— నేను మీకు విధేయతచూపిన నేమగును ? ఇప్పటి అవసరమునుబట్టి నన్ను వెంటనే తెప్పించుటకు తన భటుల నిచటికేపంపిన ప్రభుడు, నేనుకట్టువడినచో సంతసించునా ?

అధి:- నిజమే ఆర్య !— ప్రభువు కొలువుదీరి - నాకు బాగుగ తెలియును—తమకై పంపియుండిరి.

కృష్ణ:- ఎట్లు ? ప్రభువు సభలో ? ఈ అర్ధరాత్రమున ?- వానిని పట్టుకొనిరండు_ఇది సామాన్యవిషయముగాదు-స్వయముగా ప్రభువైనను, లేదా—సభ్యసోదరులలో ఒకడైనను ఈ అవమానము తనదిగా భావింపకపోడు. ఇట్టి దుండగములు

నిరాటంకముగా జెల్లనిచ్చినచో అడవిబానిసలు మనకు రాజ నీతిజ్ఞులు కావలసినదే—

(పోదురు)

రంచము 3,

సభాభవనము.

ప్రభువు సభ్యులు బల్లవద్ద ఆసీనులు. అధికారులు నిలుతురు.

ప్రభు:— ఈ వచ్చినవార్త లొకటొకటికి సంబంధము లేక పాటింప వీలుగాకున్నవి. నా ఉత్తరములో నూటపేడు నౌకలనియు మన మిత్రునికి వచ్చినజాబులో నూటనలుబది యనియు నున్నది.

రెం. స:— ఎట్లయినను ఉజ్జాయించి చెప్పువానిలో ఇట్టి భేదములు సాధారణములేగనుక అన్నియు నొకే లెక్కలో పడ కున్నను, ఇప్పుడొక సయాము నౌకాదళము సుమ్రొతాపంకకు నడచుచున్నట్లుమాత్రము అన్నియు నొప్పుకొనుచునేయున్నవి.

నావి:— (తెరలో) ఓ ! ఎవరుప్రభూ—

అధి:— నౌకలునుండి ఒక వార్తాహరుడు

ప్రవేశము. నావికుడు.

ప్రభు:— ఏమి ఇప్పటి అగత్యము ?

నావి:— సయామునుండి శత్రుసన్నాహము సింహళమ్ము వంక కేగుచున్నది. తమకిది మనవిజేయ బంపిరి.

ప్రభు:- ఏమిా విరుద్ధము ?

మం. స:- ఎన్నివిధములఁ జూచినను ఇది కేవలమసంభవము. మనదృష్టి మరొకవైపునకు మరల్చుట కిదియొక యెత్తు. మన దేశమునకు దాపై, ప్రాకారాది బలసామగ్రిలో మేటిఅగు సింహళముకన్న శక్తిలో తక్కువై మనకు దూరమున నుండుటలో సుమిత్రానే శత్రువులు తేలికసమస్యగా పరిగణింతురు- తక్కువ కృషితో వచ్చు ఎక్కువలాభమును వదలి నిష్ప్రయోజనమగు దానికి తెగించునంతటి మతిమాలిన వారని మనము వైరుల నెంచగూడదు.

ప్ర:- ఔను-ఎంతయోచించినను సింహళమునకుపోవుట అసంభవము.

అధి:- ఇంకను క్రొత్తలు వచ్చుచున్నవే !

ప్రవేశము-వార్తాహరుడు.

వార్తా:- సింహళమునకు తగిన సన్నాహముతో నడుచు వైరిని మత్కొకనౌకాదళము కలిసినది.

మం. స:- ఎన్నియుండు ననుకొందువు ?

వార్తా:- షుమారు ముప్పదియుండవచ్చును. కాని వారిపుడు తమనడకమార్చి, స్పష్టముగ సుమిత్రావంకకే పోవుచుండిరి. విశ్వాసపాత్రుడగు మిా సేవకుడు, రామరాయలు, వెంటనే అదనపు దళములను పంపగోరుచున్నాడు.

ప్రభు:- అట్లయిన నిదేనిజము. సుమిత్రావంకకే—

మొ. స:- కృష్ణరాజును, శౌర్యధనుడు వీరసేనుడును, వచ్చుచున్నారు.

(ప్రవేశము. వీరసేనుడు. మేధావి, నరేశము, అధికారులు.)

ప్రభు:- వీరసేన! మనవైరులగు సయామీయులతో పోరుటకు నిన్నిపుడే పంపవలసి వచ్చినది. (కృష్ణరాజుతో) మిమ్ముచూడనైతి ఆర్యా! దయచేయుడు. ఈ రాత్రిమాకు మీమంత్ర సహాయములు లోపించినవి.

కృష్ణ:- నాకు మీవియు నం తే-దేవా! నన్నుక్షమింపుడు. నా అధికారబాధ్యతలుగాని ఇప్పటి ఆవశ్యకములుగాని నన్ను మేల్కొలుపలేదు. నా యీ అనన్యదుఃఖము వేలనతిక్రమించి భరింపరానిదై ఇతర తాపముల మ్రింగికూడ ఇట్లే ఉండుటచే ఇప్పటి సామాన్యచింత నన్నంతగ బాధింపుటలేదు.

ప్రభు:- ఎందుకు? ఏమిసంగతి?

కృష్ణ:- నాపుత్రిక-ఏమున్నది? నాపుత్రిక.

అందరు:- చచ్చెనా?

కృష్ణ:- ఆ. నాకుమాత్రము-బైరాగులవద్దనుండి తెచ్చిన ఏ మచ్చుమందులచేతనో, ఏ వాకట్టుచేతనో, నా బంగారుతల్లి; నావద్దనుండి హరింపబడి మలినపఱుపబడి సంద్యముచేయబడినది. గుడ్డిదియు, జడమతియుగాని ప్రకృతి ఏ వశీకరణమును లేక ఇట్టి నైచ్యమున కొడిగట్టుట అసంభవము.

పరిభు:- ఈ దుర్మార్గములో నున్నవాడెవడై ననుసరే-మా పుత్రుడే కానిమ్ము-మీ పుత్రికకు స్వస్థచిత్తమును, మీకు మీ పుత్రికను, లేకుండచేసి, మీకుబద్ధుడై నిలచినచో, ప్రచండ శిక్షాస్మృతిని మీరే అన్వయించి విధింతురుగాక.

కృష్ణ:- దేవర యనుగ్రహమునకెంతయు కృతజ్ఞుడను.తమ పరిత్యేకపు టుత్తరువుపై ఇచటికి తేబడిన పాండ్యుడిడుగో ఇతడే-

అంద:- ఎంతపని !

పరిభు:- (వీరసేనునితో) దీనికిగా ఏమందువు ?

కృష్ణ:- ఏమున్నది ? జరిగిన దిది-

వీర:- ఉదారమహాశయులార ! ఈవృద్ధుని పుత్రికను గాంధర్వవివాహమున జేకొన్నమాటనిజమే-ఇదేకదా నామహాపరాధము ? కాని, దేవ !

ఉ॥ చిన్నతనాననుండి గడచెన్ రణమందె దినాలునాకు; గా
నన్నరపాలమౌళి ! ప్రధనక్షితి యోగ్యశ్రవః కఠోరభా
షన్నడు వంగనేరిచి విశాలజగంబున నొండుపల్కు తే
కున్న మదీయజిహ్వ సమయోచిత వాదము సేయజాలునే.

అయినను తమ సెలవయినచో సుస్పష్టమును అవి కల్పితమును అగు నా ప్రేమాక్రమమును, సర్వము విన్నవించెద. ఏ వేరుల, మంత్రముల, టక్కుల, చేత-అట్లని మోహపబడితినిగనుక-, ఆతని పుత్రిని పొందితినో విశదమగును.

కృష్ణః- ఎన్నడు సాహసమెఱుగదు-తన స్వల్పములకు గూడ తానేకంపించు సహజభీరువు-అట్టినాతల్లి-, స్వభావమున, వయసున, దేశమున, గౌరవమున,-ఒకటనేల ? అన్నిటను-, విరుద్ధమై చూచుటకుగూడ భయముపుట్టెడు, వీనిజూచియా వరించుట ? ప్రకృతి విరుద్ధముగ అట్టి అభముశుభమునెరుగనిబేల ఇంతకు తెగించెననుట కేవల వక్రాలోచన. ఈ కుతంత్రములు కనుగొనుటకు మంచి సూక్ష్మబుద్ధికావలె - కాన మఱల నొక్కి-చెప్పుచున్నాను!-శరీరముపై బలవత్తరముగ పని చేయగల ఏ మందులో,-లేక ఇట్టి పర్యవసానముగల ఏ వశీకరణ మూలికలో, ఆతడు దానిపై ప్రయోగించియుండవలె

ప్రభు:- ఇంతకుమించి ప్రబల ప్రత్యక్ష నిదర్శనములు ఏమియు లేనిచో అతనికి వ్యతిరేకముగా ఈకనిపించు దుర్బల కారణములు, ఈ నిరాధారపుటైయుండుటలు, వీని నేరమును రూపింపజాలవు.

మొ. స:- కాని వీరసేన ! ఒకటిచెప్పు- బలప్రయోగమునగాని, ప్రచ్ఛన్నోపాయమునగాని, ఆ సుకుమారహృదయమును కళంకపఱచి!లోబఱచుకొంటివా ? లేక, కోరిగాని పరస్పరము మనసులు తెల్పుకొనిగాని ఆమె నాకర్షించితివా ?

వీర:- దయచేసి ఆయుధాగారమున కామెకొఱకు పంపుడు. నన్నుగూర్చి తనతండ్రిఎదుట దేవినే చెప్పనిండు.

ఉ|| ఏలొకొ యీ విచారణ ? లోకించుకలోసతి యీయనున్న వా
జ్మాలమునందు నాయెడ సెమోపినచో నధికారమెల్ల ని

యన్నల మొనర్చి గౌరవము నుత్తమము మాపుటెగాక సాధుప్రా
ణాలకు వచ్చునట్లు, కఠినమ్ముగ శిక్ష విధింపుడీ ప్రభూ !

ప్రభు:- పద్మ నిచటికి తెండు.

వీర:- ఇచటికి తెమ్ము మేధావి ! నీకువలె ఆచో టెవరికిని తెలియదు. (మేధావి పోవును) పద్మ వచ్చువరకు ఈతను నొనర్చిన తప్పిదములు దేవునెదుట ఒప్పుకొనునంతటి సత్యముతో, తమ సావధాన కర్ణములకు, నాప్రేమను దేవియు, దేవి హృదయమును నేనును ఎట్లు చూరగొంటిమో విన్నవింతును.

ప్రభు:- కానీ ! చూతము.

వీర:- ఇతనికి నాపై ఎక్కువమక్కువ. నన్నితడు తఱచుగా పిలుచుచు వేట, నేగడచిన యుద్ధములు, ముట్టడులు, దైవికములు, మొదలుగా — నాజీవితకథను ఎప్పుడు ప్రశ్నించెడివాడు. నాపసిదినములాదిగ అప్పటివరకు నీటను నేలను తిరుగునప్పటి నాపిపత్పరంపరలు, ఘోరయుద్ధములలో అణుప్రమాణమునతప్పిన ప్రాణాపాయములు, ప్రబల శత్రువుకు చిక్కి దాస్యమున కమ్ముడుపోవుట, పిమ్మట విమోచనము, మొదలుగా—నాజీవితచర్యనంతయు చెప్పితి. పర్వతారణ్యములలో తిరుగునప్పుడు నేజూపిన సింహశార్దూలాది క్రూరమృగ విదారణోచిత సాహసభంగులనుకూడ వివరించితి. ఇవి వినుట కెప్పుడును పద్మ చెవులు కోసికొనెడిదికాని గృహకృత్యములు పద్మ నచట నిలువనిచ్చెడివికావు. వానిని త్వరలో చక్కబెట్టివచ్చి

తనివితీరని చెవులతో నాకథారసమును గ్రోలెడిది. ఇదిచూచి నాచరిత్రను ఇంకను తెలిసికొనుటకు ఆత్రముతో అడుగునట్లు చేసితిని. నాకష్టములుచెప్పి ఆతరుణిని కరగించితిని. నాకథాంత మున, పద్మ ఒక లక్ష నిట్టూర్పులు వుచ్చి, ఇది అద్భుత మనియు, దీనాతిదీనమనియు, జాలితో ప్రమాణములుచేసి, అసలీకథ వినకుండిన బాగుండెడిదని నొచ్చుకొని దైవము తనకట్టి పీరజన్మము నొసంగకపోయెగా అని నిస్పృహ జెందెడిది.

మ॥ తనకుఁ దా నెఱింగినట్టి యొకమిత్రంబున్నచో, దేవ ! వా
డును నాయొద్దనె నేర్చి నాకథల నెప్డుఁ బద్మకుం జెప్పచుం
డినమాత్రన్ "వరియింతువాని" నని యొంటిం జెప్పెనా కాఁపె; గా
వున నమ్ముద్దియబుద్ధి లగ్నమగు తావుంగంటి నా సువ్వెతో.

నాకష్టములచే దేవియు, దేవిచూపిన కృపారసముచే నేనును, పరస్పర మాకర్షింపబడితిమి. ఇదే నాయింద్రజాలము. అదిగో వచ్చుచున్నది.

ప్రవేశము మేధావి, పద్మాదేవి, పరిచారకులు.

ప్రభు:- ఈకథ నాపుత్రినిగూడ ఆకర్షింపజాలునేమో ! క్షమానిధీ ! కృష్ణరాజా ! నీరసమునుండి రసము గ్రహింపుము. గ్రుడ్డికన్నుకన్న మెల్లకన్నైనను మేలెగదా ?

కృష్ణ:- దయచేసి దానినే చెప్పనిండు. ఈవలపులో తనదిగూడ సగపాలుండి నేనితనిని నిష్కారణముగ దూషించి

నచో నాకధోగతియే అగుగాక. ఇటురా పిచ్చితల్లీ ! ఇచట జేరిన పెద్దలలో నీకు ముఖ్యులెవరో గమనించితివా ?

పద్మ:- జనకమహాశయ ! ఇచట నాకొక విభక్తధర్మము గోచరించుచున్నది. జన్మచేతను విద్యచేతను నీకే బద్ధురాలను. ఆరెండును నిన్ను గౌరవించుక్రమమును చెప్పుచున్నవి. నా విధేయతకు ప్రభుడవునీవే. కాని ఇచట నాభర్తకలడు-

చ॥ నిను తన తండ్రికంటె మహనీయపదమ్మునబెట్టి మున్ను మా
జనని యొనర్పలేదె పరిచర్యలు ప్రేమయెలర్ప; నట్లె పాం
డ్యునియెడభక్తియుం బ్రియతయుం బ్రకటించుటె యొప్పునాకు; భా
ర్యను పతిభక్తిమించిన సతీ కులధర్మమెకండు గల్గునే.

కృష్ణ:- నీకు దైవముతోడగుగాక. నాపని తీరినది. దేవక... రాజకీయములవంకకు మఱలవచ్చు. ఇట్టి కుమారిని స్వీకరించుట కంటె మఱొక దానినిపెంచుకొనుటమేలు. ఇటురా వీరా!— నిండు మనసుతో నీకు దూరము చేయవలెననుకొన్న దానిని - అది నీయొద్ద నిదివఱకే కద్దు-నిండుమనసుతో ఇపుడు నీకిచ్చు చుంటిని. నీమూలముననే తల్లీ ! నాకితరసంతతి లేదుగదాఅని అంతరాత్మ సంతసింపుచున్నది. ఏమందువా ? నీ తెగించిపోవుట వారికి బండకొయ్యలు వేయుమని నిరంకుశత గఱపుచున్నది. ప్రభూ ! నాకిక సెలవు.

ప్రభు:- ఈప్రియులను నీయనుగ్రహ పాత్రులను జేయు టకు నన్నుగూడ కొంచెము చెప్పనిమ్ము. వెనుకటి యాసలు

నిష్ప్రయోజనములని తోచుటచే ప్రతిక్రియలేనప్పుడు దుఃఖములు నశించును. కడచిన గోడులకు వగచుట, మఱొకదానికి స్వాగతమిచ్చుట. కావలెననుకొన్నదానిని దురదృష్టము తొలగించునప్పుడు ఓర్పు పరిహసించుటచే కీడు తేలికయగుచున్నది. దొంగిలింపబడినవాడు నవ్వుటచే దొంగయొక్క మొత్తము సంతోషమును కాజేయుచున్నాడు. నిష్ఫలదుఃఖమున గడపునాతడు తన్నుతానే దొంగిలుకొనుచున్నాడు.

కృష్ణః- కాన వైరులు సుమిత్రాను కొల్లగొట్టనిండు. నవ్వగలిగినంత కాలము మనము నష్టపడినవారమేకాము. తేలిక ఓదార్పులు తప్ప మఱేమియు భరింపనక్కఱలేనివాడు ఈ వాక్యములను చక్కగ భరింపవచ్చు. కాని, దుఃఖమును వాక్యములనుగూడ భరింపవలసినవాడు దుఃఖమునకిచ్చివేయుటకై దివాలాపెట్టిన ఓర్పును దేబెరింపవలసివచ్చును. ఈవాక్యములు మెప్పింపనుగాని నొప్పింపనుగాని రెంటను పుష్టిగలిగిన శ్లేషలు. కాని, మాటలు గాలికి పోవును. క్రుంగినమనస్సు కర్ణద్వారమున వాక్‌శూలములచే పొడువబడుట ఇదివరకెఱుగ.

ప్రభుః- శత్రుల సాధారణ సంరంభముతో సుమిత్రావంకకు గడగుచున్నారు. వీరసేన! అచటిబలము నీకువలె మఱెవరికిని తెలియదు. అచట అన్నిటచాలిన ప్రతినిధి మాకొకడున్నను భావిఫలసూచీ దేవతయగు జనవాక్యము శుభకంఠముతో నీపై బడుచున్నది. కాన క్లిష్టమగు నీజైత్రయాత్రా

మూలమున నీనూతనాదృష్టములలోని నిగనిగను కొంతకాలము చూడకుండుట కోర్చుకోవలె.

వీర:- కృపానిధీ! దినగండమగు నాజీవితము యుద్ధభూములలో ఇనుముతోను, ఱాతితోను ఏర్పడు పడకనే నాహంసతూలికాతల్పము నొనర్చినది. సాహసములకు స్వతస్సిద్ధ ఉత్సాహమున్నదిగనుక ప్రస్తుతయుద్ధములకు సన్నద్ధుడనగుచుంటిని. కావున-

ఉ॥ దేవర రాజ్యలక్ష్మికి విధేయుడనై మఱి విన్నవింతు; ప
ద్మావనితామణిస్థితికి దగ్గవిధంబున సౌఖ్యదాయక
స్థావరముల్, పదుండ్రు పరిచారికలున్, ధనసంచయమ్ము, సం
భావితవస్తుజాలము, కృపామతి నీయగదే నరేశ్వరా.

ప్ర:- నీకిష్టమగుచో నామెను తండ్రియింట నుంచుము.

కృష్ణ:- అక్కఱలేదు.

వీర:- నాకును వలదు.

పద్మ:- నాకును అంతే. అతనికంటబడుచు తండ్రిని చింతాగ్రస్తునిజేయ నామనసొప్పదు. దేవా! దయాళూ! నావిశదీకరణమునకు తమ అభ్యుదయ శ్రోత్రమునొసంగుడు. ఈ అల్పజీవి కుపకరింపగల వరమొకటి మీవలన ఆశింతును.

ప్ర:- ఏమని? పద్మా!

పద్మ:- నాజంకులేని తెంపును సర్వసంసిద్ధతయు పాండ్యునితో నుండుటకై అతనిని ప్రేమించితినని ప్రపంచమునకు చాటుగాక—

చ॥ తనువును గాక నాథుని యుదంచితరూపము లోనఁగంటి; త
ద్వినుతగుణాళిచే మది ద్రవించి తనంతనె యందులీనమై
ఘనతవహించె; వేరుపడగా నిక నేరదు; గాన రాజమం
డన ! తగవీనికర్పణమొనర్చితి నన్నును నాదుసర్వముఁ౯

ఏలనో అన్యతగోరి ఆతనిని ప్రేమించితినో అది నాకు శూన్యమగు నట్లు, ఆర్యపుత్రుడు యుద్ధమునకుపోవుచు గోళ్ళు గిల్లుకొను చుండుటకు నన్నిచట దిగవిడచినచో ప్రభూ! భారమగు వ్యవధిని భరించుటకు ప్రియమగునతని ఎడబాటును ఊతము పెట్ట వలసివచ్చును. కాన, వానితో నన్నేగనిండు.

వీర:- దేవికి మీ సెలవు దయచేయుడు. మేము, ముఖ్యముగ మానసిక సౌఖ్యముకొఱకే ఆకర్షింప బడితిమిగనుక, మొదటినుండియు యావనోద్రేకము నరికట్టిన నేను - నాఅర్థాంగి మనసు కుదుటబడి యుండుటకుతప్ప-ఇతర నిగూఢ భావముతో ఇట్లు కోరుచుండుట లేదనుటకు దైవమేసాక్షి.

తే॥ తరుణి నాచెంతనున్న మాత్రమున తీవ్ర
మైన మీపని శ్రద్ధవిహీనదృష్టి
జాతునను బీతునుండి మీ సుహృదయముల
దైవమోమెడుగాక సుధీవరేణ్య !

అంతేకాదు. నావిధ్యుక్త ధర్మములకు హానికలుగునట్లు పుష్పబాణుని చంచల విలాసములు, చుఱుకైన నావిచక్షణాదృష్టి లోలత్వమువలన ప్రారంభించినచో స్త్రీలు నాశిరస్త్రాణము

నొక మంటినుంతవలె వాడుదురుగాక. లజ్జాకరములగు దుర
వృష్టములు నావాసిని మాపుగాక.

ప్ర:- ఆమె గమనాగమనములు నీయాంతరంగిన నిర్ణయ
మునుబట్టి యుండును. ఆపని త్వరయని మొఱలిడుచున్నది.
వేగము దానికి సమాధానమీయవలె.

మొ. స:- నీవీ రాత్రికే నడువవలె.

వీర:- నిరభ్యంతరముగా.

ప్ర:- ఉదయమిచట మఱల గలిసికొందము. ఒక
ఉద్యోగిని సేనానీ! నీవెనుక విడచిపొమ్ము. అతడు నీపదవికి
సంబంధించిన ఇతర పరికరములతోపాటు మానియోగములను
గూడ తెచ్చును.

వీర:- తమ అనుగ్రహమైనచో ఇతడే నా మహా
మాత్రుడు.

శా॥ ఈ మేధావిని బోలునమ్మకపు వాడెందేవియుఙ్ లేడు, దే
వా! మీయిచ్చెడు ముఖ్యసంచయములఙ్ పద్మాసతింగూడ సం
గ్రామక్షోణికి నన్ను వెన్నవిలిజేర్పఙ్ వీడెయున్నాడు; చే
తోమోదంబగుగాదె యిట్టిరగు భక్తుల్ సేవలోనుండినఙ్

ప్ర:- అట్లేకానిమ్ము. ఆర్య! కృష్ణరాజ! సౌశీల్యములో
ఆహ్లాదకరమగు సౌందర్యమిమిడి యుండునని అంగీకరింతునేని;
నీయల్లుడు నలువునమించిన రూపవంతుడే.

మో. స:- ధైర్యశాలీ ! పాండ్య ! సెలవు. పద్మను చక్కగ చూడుము.

కృష్ణ:- చూచుటకు కనులుండినచో పాండ్య ! దాని వంక చక్కగనే చూడు. అది తనతండ్రినివలెనే భర్తను గూడ మోసగింపవచ్చు. (ప్రభువు, కృష్ణరాజు, అధికారులు పోదురు.)

వీర:- దీని విశ్వాసము పైననే నా బ్రతుకాధారపడి యున్నది. పద్మను నీకప్పజెప్పుచుంటిని మేధావీ !- నీభార్యను గూడ తోడుచేసి వీలైనంతత్వరగా తీసికొనిరా. రా, పద్మా !- ప్రస్తుతము నీచెంత గడపుటకు వ్యవధి కొద్దిమాత్రమేకద్దు. కాలము ననుసరించిపోవలె.

(పద్మా వీరసేనులు పోదురు)

నటే:- మేధావీ !

మే:- ఏమందువు ధీరమతీ !

నటే:- నేనేమిచేయవలె ?

మే:- ఎందుకు? ఇంటికిపోయి హాయిగా నిద్రపో.

నటే:- నిద్రపో ? నేనిపుడే ఎందులోనో మునిగి దీర్ఘ నిద్రపోదును.

మే:- అట్లు చేసితివా, పిమ్మట నిన్నెటికిని ప్రేమింప నను[illegible]-ఎందుకోయి [illegible]

నచే:- బ్రతుకుట బాధాకరమైనపుడు బ్రతుకుచే బుద్ధ తక్కువపని. అట్టి బాధానివృత్తి చేయగల వైద్యశిఖామణి మృత్యువే.

మే:- ఎంతటి ఘోరము! ఈ ప్రపంచమున ఏడేండ్లు నాల్గు పర్యాయములు చూచితిని. నేను కీడు మేళ్ళలో విచక్షణ చేయ గలిగినప్పటినుండియు తన కేది లాభమో గ్రహింపగలవానిని ఒక్కనినైనను చూచియుండలేదు. ఒక ధర్మసత్రపు తీపికై పడి చత్తుననుటకంటె నా మానవత్వ మొక కోతితో మార్చు కొందుననుట మేలు.

నచే:- ఏమిచేయుదును ? పద్మపై నింతభ్రమ యున్న దనుట కెంతో లజ్జగనున్నది. కాని దానినాపగలశక్తి నాలో లేదు.

మే:- శక్తి ? సింగినాదమో ! ఇట్లుండుటగాని అట్లుం డుటగాని అంతయు మనలోనే ఉన్నది. మనశరీరములే ఉద్యా నములు. బుద్ధులే తోటమాలులు. ఆ ఉద్యానమున దూల గొండి వేయుటో వంగనారునాటుటో—కలుపుకంచెలు పెంచుటో, ఫలజాతులునించుటో—వివిధములగువానికిగా భాగించుటో వీటి బుచ్చుటో—అంతయు మనలోని యాజమాన్యముననే యున్నది.

చ॥ మనబ్రతుకన్న త్రాసునకమర్చెను దైవము కామమన్న ని
డ్చని నొకప్రక్క; దానికి వివేకమునానొక సిబ్బిగూడ జే
ర్చెనిరొయెడ, క్రిందుమీదగును త్రాసటుపై మనలజ్ స్వభావ సం
జనితమనోవికారము చెసజ్ పెడదారులకీడ్చునో సఖా.

కాన మన ఇంద్రియోద్రేకములను అవశములగు కామేచ్ఛలను కట్టుజేయుటకు మనలో వివేకమున్నది, ప్రేమ, ఈ చెప్పినవాని లోని అంతర్భాగమనియా నీభావము ?

నటే:- కాదు. కాదు.

మే:- ఆప్రేమ అవశమగు శారీరకవాంఛయే తప్ప మఱియొండుకాదు. ఇంతెందుకు ? నాతోరా - మనుష్యుడవుకా- మునుగుటా !?— పిల్లులను గ్రుడ్డి కుక్కపిల్లలను ముంచు. నేను నీపరమమిత్రుడనని, నీకార్యమునకఱకు మోకులచే బిగింపబడితి నని నొక్కిచెప్పుచున్నాను. ఇప్పటికన్న మిన్నగ ఎన్నటికి నుపకరింపలేను. నీసంచిలో డబ్బువేసికో—నీవుగూడ యుద్ధము లకురా—మాయగడ్డముతగిల్చి వేషముమార్పు—డబ్బుమాత్రము సిద్ధముసుమా !- పద్మ ఇంకను ఆకటిబానిసను ప్రేమించుచునే ఉండుట అసంభవము. ముందు నీసంచినింపుకో - అత్తైనను దానినంతే. అంత తీవ్రముగ వచ్చినతీపి ఎంతకాలము నిలు చును ? ఆ తీపికి తగినచేదును త్వరలోనే చూచెదవు. డబ్బు లేకుంటే మనప్రయత్నమంతయు వ్యర్థము. ఈ పాండ్యులు చల చిత్తులు. డబ్బుంటే దేవుడు దిగివచ్చును.

మ॥ అతిమాధుర్యముగల్గి చూతఫలమట్లైయున్నయవ్వాని ప్ర
స్తుతపుందిండియు చింతకాయవలె గాంచుంబుల్వు శీఘ్రింబె; త
త్సతి కవ్వేళనుగాని, నీమిథునశబ్దంబొందు సంబంధ త
ద్ధితపుంగర్మ మొనర్పతే: వదియె కాదే నీకుస్వర్గంబిడుణ్.

వాని కళేబరముపై వెగటుత్రోచినపుడుగాని, పద్మ తనవరించుట లోని తప్పును గ్రహింపదు. ఆ వగలాడిలో నూగుమీసముల కొఱకై వచ్చితీరవలె మాగుప్ప- తప్పదు. కనుకనే నీసంచిని నింపుకొమ్మనుట. నీవవశ్యము చావనేదలచిన-చో మునుగుటకు మించిన మఱొక సుఖమార్గము చూచుకో. తేగలిగినంత డబ్బుతే. మా కటకపు నెఱజాణను, ఆ తిరుగుబోతు మొఱటు మొద్దును, ఒకేకట్టుగా బిగించినట్టి, వారి ఒట్లు, బాసలు,– అను నూలుపోగులు, నా తాంత్రికపు, ఫూ ఫూ లకు పటాపంచలై పోవునుగనుక, నీవు దానిని తప్పక భోగించితీరెదవు-కావున డబ్బు,డబ్బు,డబ్బు-మునిగి చచ్చురోగమా? చూపుమేరలోకూడ కనుపడరాదు. దానిని పొందక మునిగి చచ్చుటకంటె అట్టి సుఖప్రయత్నపు జాతరలో బలి యగుటకైనను చూచుకో.

నశే:- నీమాటపై నిలచిన-చో దరిజేర్చెదవా, నన్ను?

మే:- నామాట నీకు గుఱియే అగుచో పైకము కూర్చుకో. చాలసారులుచెప్పితి. మఱలగూడ చెప్పుచుంటిని. పాండ్యుడన్న నాకు గిట్టదు. నాకసి మనసంట నాటినది. నీది కూడ తక్కువగాదు. మన రెండుకసులను తీర్చుకొనుటకు మన మేకీభవింపవలె. ఇపుడావీరుని, అంకుటాలి మగడనిపించితివా, నీకు ప్రమోదము నాకు వినోదము చేసినవాడవగుదువు. పక్వ సమయమున బయటపడు విశేషములనేకములు కాలగర్భమున గలవు. పద-పైకము కూర్చుకో. రేపు దీనినిగూర్చి విశదముగ ముచ్చటించుకొందము. సెలవు.

నటే:- ఉదయ మెక్కడకలిసికొనుట మనము ?

మే:- రేవులో.

నటే:- సరిగా వేళకే వత్తునుసుమా !

మే:- సరేపో, జ్ఞాపకమున్నదిగదా ?

నటే- ఏమిటి ?

మే:- మునిగి చచ్చుమాటే కూడదు. సరేనా ?

నటే:- నాతల తిరిగినది. వెళ్లి మాన్యములను తెగ బరికెదను. (పోవును)

మే:- ఇట్టి మూఢులే: నాకు ముల్లెలు. నా స్వార్థవినోద ములకుగాక ఇట్టి కుంకలతో కాలవ్యయ నొనర్చినచో బహు కృషితో సార్థకముచేసికొన్న నా నామధేయమును నిరర్థకము చేసినవాడనగుదు. పాండ్యుడన్న మందుచున్నది. కాని, వానికి మాత్రము నాపై నమ్మకముమెండు. కావున వానిపై నాప్రయో గము ఇబ్బడిగ పనిజేయును. ఇందుకు తగినాతడు సత్యకుడే. ఓ బలే! బలే! సత్యకుని పదవిని పొందుటకును, నాకోరిక రెట్టింపు మోసముతో సాధించుటకును-ఎట్లు ? ఎట్లు ? హాఁ-బేష్— కొంతకాలము గడచినమీద వీడు తన భార్యతో మిక్కిలి చన వుగనున్నాడని వీరుని చెవికొఱకవలె. స్త్రీల నాకర్షించుటకని శంకింపదగిన మృదుల రూపవిలాసములు సత్యకునకు గలవు. ఇక పాండ్యుడో-

## ప్రథమాంకము.

క॥ నల్లనివినీళ్ళు తెల్లని
వెల్లను పాలనెడి సరళిహృదయుండగుటన్
మెల్లగ నెటుద్రిప్పిన నటు
వల్లెయనుచు వచ్చుగార్దభము మాదిరిగన్

ఆ! తోచినది-పన్నుగడ సృష్టియైనది. నరకయాతనా సమము లగు నాకుతంత్రములును, రహస్యపేటికయగు నీ నిశీథమును, ఈ భీకరసృష్టిని బహిరంగముచేయుగాక.

(పోవును)



# వీరసేనుడు

## [ద్వితీయాంకము]

ప్రథమ రంగము

ఒకటవరంగము

సుమిత్రా రేవుపట్టణము—సముద్రప్రాంతము.

ప్రవేశము: రామరాయలు, ఇద్దరు పౌరులు.

రా:- ఈ యగ్రమునుండి సముద్రమువిూద నేమైన కనిపెట్టగలవా ?

మొ. పౌ:- ఏమాత్రము చేతగాదు. పారావారము తీవ్రముగ కలచబడినది. సముద్రాకాశములమధ్యనొక్క తెరచాప నైనను కనిపెట్టలేకుంటిని.

రా:- నాకుజూడ వాయుభట్టారకుడు భూమిపై తీవ్ర నాదము చేసియున్నాడు. ఝంఝూవాతము మనకోటబురుజుల నెప్పుడును ఇంతగ ఊచియుండలేదు. ఇట్లే కడలిపై భీభత్సము చేసినచో తరంగపర్వతములు తమపై ద్రవించినపుడు ఓడ దూలపు కుసులు, ఏమాత్రము నిలుచును ? దీనిగూర్చి ఏమి విందుమో !

రెం. పౌ:- శత్రునౌకా విచ్ఛిన్న మే. సముద్రుడు వాతోద్ధూతవీచికామూలమున దేదీప్యమానమగు ఋషిమండలముపై నీరుచిమ్మి స్థిరులగు ధృవపాలకుల డప్పిని తీర్చునట్లు తోచు

చున్నాడు. ఘూర్ణితార్ణవముపై నిట్టి యల్లకల్లోలము నెప్పు డును చూచిఉండలేదు.

రా:- శత్రులొకదరికిజేరి నావలకు లంగరులు వేయనివో ఇట్టిగండము గడచుట కష్టము.

ప్రవేశము మూడవ పౌరుడు.

మూ. పౌ:- శుభవార్త. మనయుద్ధములు ముగిసినవి. ఈ అనివార్య మహావృష్టి శత్రుయత్నములు స్తభించునట్లు మోదివిడిచినది. చాలవఱకు కమద్దైన్యముగ ధ్వంసమై యిడు ములబడు నాపడవలదడమును ఒక కటకపునౌక చూచినది.

రా:- ఎట్లు ? నిజమా ఇది ?

మూ. పౌ:- ఆ. సింధు అను ఓడ ఇచటికి చేరినది. వీర్య ధనుడగు వీరసేనుని దండనాధుడు సత్యకమహాశయుఁడు తీరము నకు వచ్చియున్నాడు. సుమిత్రాకుగాను సర్వాధికారములతో వచ్చు పాండ్యుడు నముద్రమున నున్నాడు.

రా:- కడుసంతోషముగ నున్నది. తగిన పాలకుడతడే.

మూ. పౌ:- కాని ఈ సత్యకుడే క్షేమము చెప్పు చున్నను, శత్రునాశము మాటమాత్రమే చెప్పి,- విచారముగ దోచుచు, పాండ్యునిరాకకై తహతహపడుచున్నాడు. ఇంతకు కారణము, దారుణమగు నీపాపపుతుపాను వారిని వేరుచేసినది.

రా:- దైవము రక్షించుగాక. నేనతనికడ పనిచేసితిని. అతడు చక్కగ శాసింపగల యోధశిఖామణి. సముద్రా

కాశములకుగల ఒకేరంగును వేరుపఱచి చూడలేనంతవరకు మన దృష్టులను ఆ వీరాగ్రేసరునికొఱకు ప్రసారించుటకును, వచ్చిన పడవను చూచుటకును, అందఱము తీరమున కేగుదము.

మూ. పౌ:- అస్లీరండు. ప్రతిని మేషమును ఎక్కువరాకల కెదురుచూడదగియున్నది.

ప్రవేశము సత్యుడు

స:- ఈశౌర్యపుగడ్డన బిరుదువై పాంస్యానింతగ ఘనత పెట్టు తమకు వందనము.

తే॥ కడుప్రమాదకరంబగు కడలిపైన, వానితో విడిపోయితిగాన ఆర్య!
నైవ మయ్యద్వితీయునత్యంతకరుణ, పంచభూతాలనుండిరక్షించుగాక.

రా:- గట్టిదేనా అతనిపడవ ?

స:- ఆ-అతని వాహానపుకలప గట్టిదే. ఆనావికుని నిపుణత లోకులమెప్పును, ప్రభుత్వపు కొప్పునుగూడ పొందినది. కావుననే నాఆసలు తగుపోషణముచే మృత్యువునకు క్రింగరానివై నిశ్చితమగు స్వస్థతలో నున్నవి. (లోన కేకలు. పడవ, పడవ)

ప్రవేశము నాల్గవ పౌరుడు

రా:- ఏమూధ్వని ?

నా. పౌ:- పురమున నొక్క పురుషైనను లేదు. సముద్రఘాలమున జనులు బారులుతీరి పడవఅని కేకలిడుచున్నారు.

స:- నా ఆస లావచ్చువానికి రాష్ట్రపాలకుని చూప మిచ్చుచున్నవి. (లోన ఫిరంగి మ్రోతలు)

రెం. పౌ:- మనవారు మర్యాదాసూచకముగ ప్రేల్చు చుండిరి. వచ్చినది మిత్రులే అయియుండవలె.

స:- ఆర్య! దయచేసి ఆవచ్చినదెవరో కనుగొనుడు.

రెం. పౌ:- చిత్తము- (పోవును)

రా:- అయితే దండపతీ! మీ సేనాని పెండ్లాడెనా?

స:- మహాదృష్టసంతముగ, వర్ణనను, కట్టుకథలను, మించిన ఒక యెలజవ్వనిని సాధించినాడు. ఆమె, చిత్రించు కలముల జిత్తులకందక, సృష్టియొక్క రసవదాకృతితో రచయితకు అలుపు దెచ్చుచున్నది.

ప్రవేశము రెం. పౌరుడు

ఏమి? ఇపుడు దిగినదెవరు?

రెం పౌ:- సేనానికి మహామాత్రుడు మేధావి అను నాతడు.

స:- అత్యంత సుఖకరమగు వేగమున వచ్చినాడు' తమకై తామె-తుపానులు, గభీరసాగరములు, భీషణ ఝంఝా వాతములు, వాడితిప్పలు, సైకతములు మొదలుగా - నిరప రాధినియగు నౌకను కూల్చుటకు డాగియున్న ఈ విద్రో హులు-, సౌందర్య వివేచనచేతనా అనునట్లు దేవాం

గనయనదగు పద్మాదేవిని సుఖముగ పోనిచ్చి తమ దురణాంతక స్వభావములను విడచినవి.

రామ:- ఎవరామె ?

సత్య:- ఆమె ? ఎవడు ఇచటికి తనరాక విషయములో మన అంచనాలను ఏడుదినములు ముందుకు జరిపింపగల్గెనో అట్టి ధైర్యమూర్తి మేధావి రక్షణలో తేబడిన మన సేనానికి సేనాని.

(ఆకసమువంక చేతులు జోడించి)

మ॥ తననా కామణిచేత నియ్యెడసుమిత్రా రేవుదీపింప, గుం
దిన యుత్సాహపుటగ్గి మామనములం దీపింపజేయంగ, అం
కను క్షేమంబులదేల్ప, నాత్మసతి దృగ్జాలంబులో స్వీయదృ
ష్టినిజేర్పన్ పవమాన! పాండ్యుడిటకొచ్చే చేసినట్లూదవే.

(ప్రవేశము, పద్మ,నీలాంబరి, మేధావి, మాచువేషములో నచేశమా, పరిచారకులు.)

ఓ, అటుచూడుడు! నాకామహాలక్ష్మి నడచివచ్చుచున్నది. సుమిత్రావాసులారా! ఈయమకు మీజోహారు లర్పింపుడు. దేవీ! స్వాగతము. దైవకృప ముందువెనుకలను ఇరుపార్శ్వములను గూడ మిమ్మావరించుగాక.

పద్మా:- సత్యకవర్య! నీకెంతయు కృతజ్ఞురాలను. సేనాని ఎచట కుశలియైయుండెనో చెప్పగలవా? 

స:- అతండింకను చేరలేదు దేవీ!- అతడు సుఖి అనియు

కొలదిసేపటిలో నిచటికి చేరఁగలఁడనియు తప్పనూ తేమియు చెప్పలేను.

పద్మా:- ఏమి? అతని నెట్లుబాసితివి?

స:- సముద్రాకాశముల మహాసంఘట్టనము మాసావా సమును విడదీసినది. వినుడు వినుడు, (లోన "పడవ, పడవ" ఫిరంగిమ్రోతలు)

రెం. పౌ:- కోటకు నీరాజనము లిడుచున్నారు. వీరును మన హితులే.

స:- అదేమో కనుగొనుడు- (పౌరుడు పోవును) మహామాత్రా! స్వాగతము. (నీలతో) అమ్మా నీకును స్వాగతము. నాచనవునధికముచేసితినని మేధావీ! నీసహనమును నొప్పింపకు. మొదటినుండియు కలుపుగోని మాటాడుట, నా అలవాటు.

మే:- చివరనుండియు తననాలుకను స్వేచ్ఛగా నాపై విసరుట నీలకలవాటు.

పద్మా:- అయ్యో! ఆమెకు మాటయేలేదే.

మే:- అబ్బో అమితముగ. నేను నిద్రకు కనుమూయు నపుడు నిశ్శబ్దముగనుండి,-తమ ఎదుట చెప్పుచున్నాను-పిమ్మట తన నాలుకను హృదయములోబెట్టి ఊహతో తిట్టును.

నీ:- నన్ను కారణముగ నిందింపుచున్నారు.

మే:- ఏమి? విను విను. మీరు ఇండ్లవెలుపల వన్నె చిన్నెల బొమ్మలు. ముంగిళ్ళలో వీణానాదములు. వంటసాలలో జంగుపిల్లులు. మంచుటకు ఆషాఢభూతులు. పట్టితే పిశాచములు. మీకు పనివేళ ఆటలు_ఆటలప్పుడు పనులు.

పద్మా:- ఛీ ఛీ దూషణ ప్రలాపీ!

మే:- కాదు నాచెప్పునది సత్యము. కాని-చో నేనొక మ్లేచ్ఛుడనే. మీరు ఆడుకొనుటకు మేల్కాని పనివేళ నిద్రింతురు.

నీ:- నాస్తోత్రము వ్రాయనక్కరలేదు.

మే:- వ్రాయనీకుండుటే మంచిది.

సత్య:- సరేకాని మన కటకపురాణిని వర్ణింపవలసిన-చో ఏమివ్రాయుదువు?

మే:- ఓ నన్నందుకుమాత్రము నియమింపకు సత్యక! నాలో విమర్శనముతప్ప మతేమియులేదు.

పద్మా:- తీరమునకెవ్వరైన బోయిరా?

మే:- అవును. ఇపుడే ఒకరు వెళ్ళిరి.

సత్య:- ఇంతలో ఆవర్ణనకానిమ్ము చూతము.

మే:- అదియే యోచింపుచుంటిని. నాకల్పన గొంగడి కతికిన జిగురువలె పుర్రెనుండి సులభముగ వచ్చుటలేదు. అది మొదడునంతటిని గుంజుచున్నది. తుదకు నావాగ్దేవి కష్టించి

కనుచున్నదిది.—రూపవతియు ప్రజ్ఞావతియునైనచో—రూపప్రజ్ఞలలో—మొదటిది ఉపయోగపడును. రెండవది దానినుపయోగించుకొనును.

పద్మ:- బలేపొగడ్త. ప్రజ్ఞావతియై నల్లనిదైనచో?

మే:- నల్లనిదైనను ప్రజ్ఞఉన్నచో తనసలుపునకు సరిపడు ఒక తెలుపును గడించుకొనగలదు.

పద్మ:- ఛీ. ఛీ. గోత్ర-

నీ:- అందగత్తెయై మూఢ అయినచో?

మే:- అందగత్తె అయినదెప్పుడును, మూఢ కానేరదు. ఎట్లన తనమౌఢ్యముకూడ తనకొకవరుని గడించుకొనుటకు సాయపడును.

సత్య:- ఇవన్నియు కల్లంగడిలోకూడు లభంగులను నవ్వించు తాతలనాటి అర్థములేని అసందర్భములు. కురూపియు మతిమాలినదియు అగు దానికేగతి గల్పించెదవు?

మే:- అంతకురూపియు మతిమాలినదియు నగున దెచటను ఉండబోదు. కాని అట్టిదికూడ తెలివిగల అందగత్తెల వలె లేనిపోని మెచ్చులకుబోవును.

నీ:- ఏమీవికటము! కనిష్ఠులను గరిష్ఠులుగ పొగడుట? అయితే, తనగుణాధిక్యతచే అసూయాదేవతనుగూడ మెప్పింపగలిగి అన్నివిధముల నర్హయగు వనితనెట్లుస్తుతింతువు?

మే:- నిరంతరసౌందర్యముగలిగి, ఎప్పుడునునిగర్వయై—

వచో నైపుణిగలిగి, ఎన్నడును అధికప్రసంగినిగాక-, కొంతలేక గూడ, డాంబికాలంకరణములకుబోక-, కోర్కెలకులోనుగాక అనుభవించు అదనెఱిగి-, ప్రకోపింపబడి ప్రతీకారముచేతనుండి గూడ తనకై నకీడునుమ్రింగి వైమనస్యమును పాఱదోలి-, మసి పాతలకొఱకు మాణిక్యములనువెచ్చించునంతటి అవివేకినిగాక-, తనకుదా చక్కగ విచారించుకొనగలిగి, అంతరంగము నెప్ప టికి వెలిబుచ్చక-, ఎవ్వెడనైనను ఇట్టిది ఉన్నచో, ఆమెయే ఒక ఆడుది.

పద్మా:- ఏమిచేయుటకు ?

మే:- గుడ్డికూనలకు పాలిచ్చుటకు- చాకలిపద్దులు వ్రాయుటకు.

సత్యా:- ఆహా ! ఎంతవంకరగా తేల్చితివి ! నీకుభర్తయే అయినను నీలా ! అతనినుండిమాత్రము నేర్చుకొనకు. ఏమం దువు దేవీ ! కేవలము వికటపు టధికప్రసంగికాడా ఇతడు ?

పద్మ:- అతడు సైనికుడేగాని పండితుడుకాకపోవుటచే మేధావిమాటలు కొంచెము మోటుగనుండును.

మే:- (తనలో) దేవియందెక్కువ చనవు చూపు చున్నాడు. అవును-బాగున్నది. పద్మతోనా పకపకలు ? ఈ సంభాషణములోనే నిన్నుపట్టెదనుగా. ఈ రకపునవ్వులు దండ నాయకత్వమునుండి నిన్నూడ్చు పక్షమున నీకుమించిన ఇట్టి పోకడలు లేకుండుటమంచిది. సెబాస్ ! నీపెదవులపై నుంచు

కోసిన ఆవ్రేళ్ళు నాభికొమ్మలైనచో ఎంతబాగుండునురా ! (లోన శంఖారావము) పాండ్యుడు. ఆతని శంఖమదే.

స:- అవును, అతడే.

పద్మా:- వెళ్ళి తీసికొని వత్తమా ?

స:- చూడు ! అతడే వచ్చుచున్నాడు.

ప్రవేశము. వీరసేనుడు, సేవకులు.

వీర:- ప్రియశౌర్యమా!

పద్మా:- ఎంతటి అదృష్టము ?

వీర:- నాకన్న మున్నుగా నిన్నిచట చూచుటకు దేవి! తృప్తినిమించిన ఆశ్చర్యమగుచున్నది. ఓబ్రహ్మానందము ! ప్రతి భీభత్సమునకు పిమ్మట ఇట్టిప్రశాంతివచ్చుచో మృత్యువును సైతము లేపువఱకు ప్రళయవాయువులు వీవవచ్చు. మీాదు మిక్కిలి కష్టించునౌకలు నక్షత్రములంటు సముద్రపర్వతము లెక్కి స్వర్గమునుండి నరకమునకువలె అధఃపతితములు కావచ్చు.

మ|| విపులంబైన ముదంబుతో మనసు తృప్తింబొందియున్, భావికా
లపు నాజీవితమందు, సౌఖ్యమిక నీలాగౌనెయుంచుం గడుం,
దపనం బొందెదగాన, నిమ్మదము మధ్యన్ మృత్యువౌచో, ధరి
త్రిపయిన్ వేఱొకగీతలేక మనకెంతేభాగ్యమైనట్లైగా.

పద్మా:- అమంగళము దైవము నిషేధించుగాక.

ఆ|| మన దినములతోడ మనప్రేమబంధముల్
క్షేమములును వృద్ధిఁజెందుఁగాక,

కాలచక్రమింకఁ గదలకుండఁగ రాజ
యిప్పటట్లు మనకు నెప్పటికిని.

వీర:- శుభగ్రహములారా! తథాస్తనుడు, ఈహార్ష పరిమితిని చెప్పలేకుంటిని. నాకది పుక్కిలింతలై వాగ్బంధము చేయుచున్నది. నిర్భరానందము! (రత్నహారములిచ్చుచు) మనహృదయము లెప్పటికైనను పొందు విపరీతశ్రుతి విరోధము ఇట్టిదే అగుగాక.

మే:- (తనలో) ఓ—మీరు చక్కని మేళసములోనుంటిరి. కాని బిరడలు సడలించి. ఈ గీతమును నావలె మంచిదానిని చేసెద.

వీర:- రండు కోటకేగుదము. శుభవార్త. మిత్రులారా మనయుద్ధములు ముగిసినవి. నైరులుమునిగిరి. ఇచటి నాపూర్వ పరిచయులు సుఖముగనుండిరా? పద్మా! సుమిత్రా ప్రజలలో అధికానురాగము నాయెడనున్నందున ఇచట నిన్ను మిక్కిలిగ ఆదరింతురు. తీరమునకేగి సరకులు దింపింపుమేధావీ! కోటకా నావికునిదెమ్ము. మంచినిమించిన అతని విలువకెంతటి గౌరవము చూపినను తక్కువే. రా, దేవీ! ఈదీవిని మఱల సుఖముగ గలిసికొనుట మహాదృష్టము. (మేధావీ నశేశులుతప్ప అందఱు పోదురు.)

మే:- నన్ను వెంటనే రేవుచద్ద కలిసికో—రాదగ్గరకు. "కామాతురాణాం నభయం నలజ్జా" అనిశాస్త్రము ఘోషించు

చున్నది గనుక,- తెగింపగల మగతనమే నీకున్నచో—, నామాటవినుం. దండనాథుడీరాత్రి తానే కోట కావలి కాయును. అసలు ముందిదినీకు చెప్పవలె. పద్మ పూర్తిగ అతనిపై కన్నువైచినది.

నశే:- ఎతనిపై ? అతనిపైన ! అసంభవము.

మే:- నీవ్రేలిట్లు వేసికొని చెప్పునది సరిగ పట్టించుకో- అసంగతములగు తప్పుడుకూతలకును ఆత్మస్తోత్రములకును గాక, మఱేమిచూచి మొదట ఆపాండ్యుని పద్మ అంతతీవ్రముగ ప్రేమించెనో నాకుచెప్పు ! ఈ వాగుడుకే అతనినింకను ప్రేమించునా ? ( ఇట్టివిసమ్మి బొందనపడకు) — దానికన్నులకు పండుగు కావలె. అట్టికొఱవిదయ్యమును చూచుట ఏమిసంతోషింపను ? కేళీవిలాసములో రక్తమునకు మాంద్యమేర్పడినపుడు దానిని మఱలనుద్దీప్తముచేసి రుచికరమగు నూత్నక్షుధను కల్పించుటకు, వయసున, రూపమున, ఆచారమున సమాన ప్రతిప్రత్తి ఉండవలె. మన వీరునికున్న లోపములేఇవి. కావలసిన ఈవాటముల కొఱకు తనవెనుకటి పొరపాటుకు చెంపలు వేసికొని తలకంటగించుటచే ఆచప్పిడి పాండ్యు నీసడింప జూచుచున్నది. ఇందున తనప్రకృతియే తనకు బుద్ధిజెప్పి వేఱొకని జూచుకొమ్మని పొడుచుచున్నది. ఒకవేళ అదియే జరగుచో—అది అవశ్యముగ, స్వభావ సిద్ధముగ వచ్చుస్థితిగనుక-, సత్యాకునిమించి ఎవడీయదృష్టతాపథమున సమర్థుడుగా నిలుచును ? వాడు నమ్మరాని

దొంగ. తన రుచులు తీర్చుకొనుటకు మర్యాదావేషము వేసి కొనును. సమయము కనిపెట్టుటలో దక్షుడు. నిజమగు అను కూలతలేకున్నను అట్టిది సృష్టించి ఉన్నట్లునటింపగల జాగ రూకుడు.

ఆ॥ వ్రాలనిచ్చునట్టి పూలుండవలెగాని, రసముపీల్చగోరి విసువులేక
యదియెపనిగ తిరుగునట్టితుమ్మెదసుమీ, యతడునిన్నబోంట్ల కర్థమగునె

దీనికితోడాటకర్రి రూపరి. యువకుడు. అపక్వ మతులగు అమాయికలను ఆకర్షించుటకు కావలసిన అన్నియు ఉన్న వాడు. పద్మ వానినప్పుడే చూచుకొన్నది.

నటే:- ఆమె ఇట్టిదనిన నమ్మను. ఆమెగుణములు కడు మెచ్చదగినవి.

మే-: మెచ్చదగినవి? ఛీ-ఛీ-

తే॥ మెచ్చదగినదెయైన దామెచ్చుకొనునె, యట్టియాతని ? తాదినునట్టిపైన
నుప్పుపులుసులెగావున నుండగలదె, దానిమృదుగాత్రమొకచవియైనలేక

బలేది! వానితో అదిచేసిన సరసములు నీవు చూడలేదా ? అవి కనిపెట్టలేదా నీవు ?

నటే:- నిజమే- కేవలమర్యాదామాత్రమేగదా అది ?

మే:- ఈపాదసాక్షిగ లంజలమారితనము.తుచ్ఛభావము లకు విషయసూచిక. కామరంగములకు అస్పష్టప్రస్తావన. వారి అధరములు మఱింత దగ్గరి, వారిఉశ్వాసములు పెనవేసి

కొనినవి. కొంపలుపోవు ఆలోచనలుసుమా అవి? ఈ పరస్పర ములు ఈరకపు దారితీసినచో అన్నిటిమించిన ఆముఖ్య పర్యవ సానము ఎంతలో వచ్చును? ఛీ రోత. కాని మిత్రమా నిన్ను ఎంతోదూరమునుండి తెచ్చితి. నేచెప్పినట్లు విను. నీవుకూడ కావల్లిలో ఉండు. సత్యకుడు నిన్నెఱుగడు. పెద్దగమాటాడి గాని, ఆజ్ఞోల్లంఘనముచేసిగాని, లేక నీవీలుకునచ్చిన మరే మార్గమునగాని వానికి కోపము తెప్పించు. నేను నీకెంతో దూరమున నుండను.

నటే:- సరే-

మే:- కాని, వాడుత్తతుస్సుపింజరి. ఎప్పటికిక ప్పాకు ఛట్టుమనును. నిన్నొకటి వేయనుగూడవచ్చు. వాడట్లు చేయు నట్లు రేపవలె. ఆమాత్రమునే ఈ సుమిత్రాలో తిరుగుబాటుకు కారణముచేసెద. దానితో సత్యకునూడబెటికివగాని ఈ ప్రజలు శాంతిపరు. పిమ్మట అప్పటికి నాచెప్పబోవు పద్ధతిమూలమున నీమనోరథములకడకు సులువుగ అడ్డదారిని త్వరలో చేరగలవు. కావున మన ప్రయోజనముకొఱకుముందు ఈ గులకరాతి నీడ్చివైచినగాని మనయదృష్టతాపథము మెత్తగిలి చరణయో గ్యము కాజాలదు.

నటే:- నాకేమాత్రపు సందుజిక్కినను దీనిని తప్పక చేసెదను.

మే:- బహుజాగ్రతసుమా. నన్నుకోటవద్ద తప్పక కలి

సిఖో. నాకు సేనాపతిపరికరములను శిబిరమునకు చేర్పవలసియున్నది. వెళ్లిరా.

నటే:- సరే సెలవు. (పోవును)

వే:- పద్మాసత్యకు లొకరినొకరు ప్రేమించుచున్నారని చెప్పినచో అసంభవముగాతోచదు. పాండ్యుడు - అతడనిన ఏలనో నాకుపడకున్నను- నిశ్చలుడును ప్రేమపూరితుడును అగు ధీరోదారుడు. ముమ్మాటికి పద్మకతడు ప్రియభర్త. నాపాన్పునకీ పాండ్యులోలు ఢాశించియుండునని శంకింతునుగనుక- కేవల శారీరకేచ్ఛకేగాకున్నను-నాకసికి బలియిచ్చుటకు నేనుగూడ అట్టిమహాపాపమున కొడిగట్టినను గట్టవచ్చు.

ఆభావము విషపాషాణమువలె నా అంతఃకరణములను తినివైచుచున్నది. అతనితో సమముగ, భార్యకు భార్యను పొందువరకు-, అది విఫలమైనచో ఏపర్యాలోచనయు దరిజేర్పలేని శంకాసముద్రమున పాండ్యునివదలువఱకు నా ఆత్మను మఱేదియు తృప్తిపరుపదు, పరుపలేదు. ఇదిచేయుటకు ఎవని పదేపదే వెంటాడుటను అరికట్టుచుంటినో అట్టి యీకటకపు త్రాష్టుడు నామాటపై నిలబడుచో-సత్యకునిని దెబ్బతో పడగొట్టి-ఆసత్యకుడుకూడ నీలపై కన్నువేసెనేమోఅని సందేహముగాన-, కామప్రసక్తిలోనున్నపుడు వానిని పాండ్యునకు ప్రదర్శింతును. పై పెచ్చు తన ప్రశాంతిని తాంత్రికముచే ఉన్మాదమునరకీడ్చుకొనిపోయి తనొక్క అసాధారణపుగాడిదను

చేయుచున్నందుకు పాండ్యుడు నన్నుప్రేమించి బహూకరించి కృతజ్ఞతచూపునట్లు చేసెద.

చ॥ కలదు సమస్తమిచ్చుటనె; కానియిదేలనో తేటతెల్లమై
తలపునతోచ; దైననుచితస్థితినెప్పటికెట్లో యట్టిరీ
తుల జనుటొప్పుగాని తొలుదొల్తనె దేవునకైన దుష్టచే
ష్టలకిదమిద్ధమంచు ప్రకటంబుగ నాకృతినీయశక్యమే. (పోవును)

రంగము. 2.

కోటలోగది_ప్రవేశము–పద్మాదేవి, నీలాంబరి.

ప:- అదియా నీసంకోచము?— లోకముకొఱకైన ఆ వెలుపు లోకము గ్రహింపలేని ధర్మములో మాత్రమక్కఱలేదు. ఇంతకు తప్పుదిద్దుకొమ్మందువా నన్ను?

నీ:- ఛీ-ఛీ- ఎప్పటికినిగాదు. నాశంకతీర్పుమని.

ప:- ఇట్టిశంక ఎదుటివిషయమునసేతప్ప స్వవిషయమున ఏమాత్రముగూడలేదా? ఒక్కటి-.మీాజంట తూచినట్లున్నదా?

నీ:- కాని ఎబ్బెటికముగలేదు.

ప:- అది నీదృష్టిలో—లోకులదృష్టిలో ఇంకను కొంచెము మార్పుండును. ఇంతెందుకు? అందముండియూ లేకుండియూ ఒకనికినచ్చిన దొకరికి నచ్చకుండుట?

నీ:- అది తెలివిలోని తరతమభావములబట్టి ఓకేవస్తువు ఒకనికి నచ్చుట ఒకనికి నచ్చకుండుట.

ప:- సరే. కాని- రూపవంతులేలని పరస్పరము మెచ్చు కొనిన దంపతులే ఒకొక్కప్పు డొకళ్ళొకళ్ళకు విరూపులుగా దోతురే, అందమేమైనది ?

నీ:- అదిఅందము వాడబారినప్పటి విషయము.

ప:- కాదు కాదు. అంతకుముందుకూడ. అయితే కేవల కురూపమిధునముగూడ అన్యోన్యముతోనుందురే అచట అంద మేది ?

నీ:- అది అక్కఱ. అక్కఱమీద మక్కువపుట్టి చక్కన తోచును.

ప:- అనగా తోచునేకాని లేనట్లేకదా.

నీ:- (మౌనము-)

ప:- అయినను ఇంకొకటి- అందము సుఖపడుటకేకద? నీవుచెప్పునట్టి అందములేకకూడ సుఖపడ వీలున్నపుడు ఆ అంద ముతోపని ?

మ|| ఒకచోనందము సర్వముంచునెడ, మూఢౌఘమ్ము లద్దాని గా
నకచింతించు విదేశవాసులకు సందర్శింప దీర్ఘాత్రి నిం
కొకడుఁ రూపసియుండ డిద్ది మదిలోనూహించియే తొల్లిసృ
ష్టికలాపేశలుడీశుడా సొబగునుంచెఁ సర్వజాతమ్ములఁ.

నీ:- నేనుమాత్ర మొకేచోట నున్నదంటినా ! కొన్ని చోట్లమాత్రనున్నదంటిని.

ప:- పొరపాటు. ఆచోట్లు సామాన్యదృష్టికిగూడ వ్యక్త

ములగుచున్న వన్నమాట. ఈశ్వరనిర్మితమునమనోజ్ఞముకాని దే లేదు. కాని, మనబుద్ధిచాలక ఒక్కొకచో నున్నదిమాత్రమే గ్రహింప గల్గుచున్నాము. సర్వమున అట్లుచూడగల్గుట విశేషము. చంచలులకు స్థిరముగ నేదియు బాగుండదు.

నీ:- ఇంతకు అందమన నేమి ?

ప:- మనసుకలియుట- కుదురుట- అదియే సౌఖ్యము. అట్లుగానినాడు నీవుచెప్పు సుందరమూర్తులయ్యు దంపతులు సుఖపరాఙ్ముఖులై వేరుగాబోదురు.

తే|| అంతరాయంబులేని ప్రియతకుదోషు,
బహుళశరీరానుభావ్య దాంపత్యమెసగి
సుగుణ పుంజముల్ గూర్చి మాయుగళముసెడ,
దేవ! అశ్రాంత కరు ణార్ద్రదృష్టిబగవు. (నమస్కరించును.)

నీ:- లోకుల గుసగుసలపై దేవీ? ఈప్రసంగము తెచ్చి నందుకు మన్నింతువుగాక. (తెరలో)

చ|| అరులు మునింగినందున, మహాశయుండౌ దళవాయి శ్రోత్రగా
పరిణయమైన యందున, శుభప్రతిపాదనరీతి నేటిరా
తిరి రుచిరాన్నపాన నిరతిందగి, యెల్లరు నృత్తగీతవా
ద్యరవ నిమగ్నులై బహువిధప్రమదంబుల దేలియాడుండీ.

ప:- వింటివా? జాగు సేయక అలంకరించుకొందము రా.

(పోవును)

రంగము. 3. కోటలో పెద్దచావడి.

ప్రవేశము. వీరసేనుడు. సత్యకుండు పరిచారకులు.

వీ:- గుణశాలీ సత్యక ! ఈరాత్రికాపుదల నీవుచూడ

వలె. హద్దుమీరిన వేడుకలను మర్యాదయోగము చేయరాదను టకు మనమే ఆదర్శప్రాయులమై యుండవలె.

సత్యః- చేయవలసినది మేధావి కుత్తరువుచేసితిని. అయి నను స్వయముగకూడ కన్నుగలిగి చూతును.

వీరః- మంచిపని చేసితివి. అతడు కడు యోగ్యుడు. ఇప్పుడు దండపతీ! పెలగునంతటికి త్వరలో ఉదయము నీతో మాటాడవలె. (పోవును)

ప్రవేశము మేధావి

సత్యః- దయచేయుము మేధావీ! మనమిప్పటినుండియే కావలికాయవలె.

మేః- అప్పుడేనా? సరిగా ఇప్పుడు పదిగూడగాలేదు. మన సేనాని తనముద్దులాడిపై తీపితో మనలనింతత్వరలో వదలి పోయినాడు. కాని ఈమాత్రకే మనమతని నెంచరాదు.

సత్యః- ఆమె ఒక దివ్యసుందరి.

మేః- బలే చురుకై నదనికూడ చెప్పవచ్చు.

సత్యః- నిశ్చయమునకామె ఒక నవీన సుకుమార-

మేః- అదియా? దానిచూపులేమనుకొంటివి? అందు రాయబారములున్నవని నాయూహ.

సత్యః- సౌల్యపుచూపా? కాదు. కాదు. అది కేవల నమ్రతా మాత్రమునసియే నాయూహ.

మే:- అయితే దానిపల్కులు నర్మగర్భములుగావా ?

సత్య:- ఏమోకాని ఆయిల్లాలొక స్వచ్ఛతాస్వరూప.

మే:- సరేమంచిది. వారికి శుభమగుగాక. రామిత్రమా! నావద్ద ఒక మంచి సారాయిబుడ్డిగలదు. ఇచటనే వెలుపల ఈదేశపు నీటుకాండ్రిద్దఱు మన కటిదేవునిపేరు చెప్పుకొని తాగుటకు ముచ్చటపడుచున్నారు.

సత్య:- నీపుణ్యముగాని ఈ రాత్రికిమాత్రము వద్దు. త్రాగుడున నాబుద్ధి కేవలముబలహీనమై అధీనము తప్పును. మర్యాదాక్రమ మింకొకరకపు వినోదము కల్పించినచో ఎంతో సంతసింతును.

మే:- ఓ తప్పదు. వారు మనమిత్రులుసుమా! ఒకే లోటా,- అంతగా అయితే నేనుగూడ త్రాగుదునులే.

సత్య:- ఇదివరకే ఒకగిన్నెడు తాగితిని. జాగ్రతగా దానిని పలుచనగూడచేసితిని. ఇటు చూడు, అది చేయుచున్న చిత్రము! బొత్తుగ తట్టుకొనలేకపోవుట కేవలదురదృష్టము. నాబలహీనతకింకను భారముగల్పింప సాహసింపను.

మే:- ఎక్కడవాడవోయి! ఇది వేడుకల సమయము. పాపమాయోధులు కుతి పడుచున్నారు.

సత్య:- వారున్న దెచట ?

మే:- ఇచటనే వాకిట. కొంచెము పోయి పిలుచుకొనిరా పాపము.

సత్యా:- అట్లే పోదును. కాని నాకంత ఇష్టముగ లేదు.
(పోవును)

మే:-

ఆ|| ఇంకనొక్క గిన్నె డెబ్బైనత్రాగించి,
తొలుతగొన్న సురకు తోడు సేయ
కాట్లకుక్కరీతి గర్జించు,నిర్నిమి,
త్తంపుగయ్యమునకు ద్రవ్వనితడు.

ఇపుడు కామము తలక్రిందుజేసిన నామూర్ఖనశేఖరుని, పద్మాక్షి భోగమబ్బినట్లే, ఈరాత్రి కమ్మనిమద్యము బుడ్డి అడుగంట పీల్చి సోలుచున్నాడు. వీడు కావలిగాయుట.- పైపెచ్చు ఆభిజాత్య రాజసములుగల్గి ఏకొంచెపు టుపచారమునుగూడ సహింపని అభిమానధనులగు సుమిత్రాప్రతాపమూర్తులు మువ్వురు యువకులకు పోర్లుగిన్నెలతో ఉడుకెక్కించితిని. వీరుగూడ కావలిగాయువారే. ఇప్పుడీ తందనాలముతాలో ఇచటివారికి రేగునట్టి ఏతప్పుడుపనినో సత్యకునిచే చేయింపవలె. అరుగో వచ్చుచున్నారు. ఈ నాస్వప్నము ఫలవంతమేఅగుచో నీటివెంబడి గాలివాలున నాపడవ నిరాటంకముగ సాగును.

ప్రవేశము. రామరాయలు, పౌరులు, సత్యకుడు, సారాయితో పరిచారకులు.

సత్య:- దేవుడుతోడుగా నాకిదివరకే ఎక్కించిరి.

రా:- నిజమునకు బహుస్వల్పము. సాటి సైనికుడను

గనుక నామాట తీసివేయక ఒక గిన్నెను మించకుండ.

మే:- మఱికొంతసారాయి. హా!

గేయము

సారాయిననోరూరు, సారంబుతయుగ్రోలి
సారెసారెకుకైపు, మీర నటియించుసోలి
సుకముపడవలె గాని
ఒకరు నవ్విన నేని
ఐన బ్రతుకొక జేన
సైనికుడు నరుడే గాన
జేసెడు సారాయిబుద్ధి, సేవింప కింకెందుకు
సైనికుడూరక యుండవలెరా—చక్కగవినరా॥ సారా॥

సత్య:- దేవునెదుట చెప్పుచున్నాను. అద్భుతమగుపాట.

మే:- మీరు వినలేదుగాని మనదేశమున నేర్చు కొన్నదే. అచటమాత్ర మీపందెమందంచెవేసినచేతులు. నీఆంగ్లేయుడు, నీబోడ్డిచైనీయుడు-ఓ! ఏమితాగుడు, ఏమికథ? నీభారతీయునిముందు పీసమునకుగారు. ఒక వేళ ప్రభుత్వము నిషేధించుచో బలవన్మరణమునకైనను ఒప్పుదురుగాని దీనిని మాత్రము మానరు.

సత్య:- ఆ! నీభారతీయుడు తాగుడున అంత మొనగాడుగా!

మే:- ఎందుకు? రెండవబుడ్డి కొట్టకముందే నీచైనీయుని చావుకు తెచ్చిపెట్టి, నీయాంగ్లేయునికి ముచ్చెమటలు గ్రమ్మించు

నంతటిని త్వరలో సులువుగ (త్రా)గివేయగలడు.

సత్య:- అంతయు మన సేనాని పేరుమీద నేగద ?

రా:- ఓ ! నేగూడనుంటినను కో-నీ కగౌరవము రాసీను.

మే:- ఓభరతమాతా ! ఎంతకమ్మనిదానివే ?

గేయము

ఆండపిండాజాండములు సర్వమునొక్కే, ఆకారముందాల్చినట్లు
ఒండుకులకు చెప్పవలచి గుండులవంటి, పండులనుధరియించె చెట్లు
"జనులకెల్లరకు శుభమగున దేపండు?"
అనివిచారించి మేలనిరితలపండు
దానితత్వము చక్కగా నెఱింగిననరుడు-తానుచీకటికొంపజారడు
అనెను వీరబ్రహ్మగురుడు॥ అం॥

సత్య:- ఎందుకు? దానికంటె ఈపాటమఱింత బాగున్నది.

మే:- మఱల విందువా ?

సత్య:- అక్కఱలేదు. ఇట్టిపనిచేయువాడు తనపదవికి తగడనియే నానమ్మకము. సరే మంచిది. అందఱకు పైన దేవుడున్నాడు. రక్షింపదగిన ఆత్మలు కొన్ని గలవు. రక్షింపగూడనివి గూడ కొన్ని గలవు.

మే:- నిజము మహాదండపతీ!

సత్య:- నామట్టుకు నేను-సేనానికిగాని మఱేగొప్పవానికి గాని తప్పుగాదుగాన,-రక్షింపబడవలెనని యున్నది.

మే:- మఱి నేనుగూడ నంతే దండపతీ !

సత్యః- ఆ ?!-, నీదయవల్ల నాకంతెముందు వల్లగాదు. మహామాత్రునికన్న ముందు దండపతి రక్షింపబడవలె. దీనిని గురించి ఇకవద్దు. మనకర్తవ్యముల జూచుకొందము. దైవము మనతప్పులను రక్షించుగాక - కాదు కాదు - క్షమించుగాక. అయ్యలు ! త్రాగియుంటి ననుకొనకూడదు. ఇతడు నామహా మాత్రుడు. ఇది నాకుడిచేయి. ఇది నాఎడమచేయి. ఇప్పుడు త్రాగియుంటినా ? చక్కగనిలువగలిగి పొర్లుపోకుండ మాటాడ గలను.

అందఱుః- బలేబాగున్నది.

సత్యః- కాబట్టి అంతయు బాగుగనేయున్నది. కావుననే నేను తాగితి ననుకొనగూడదు. (పోవును)

రాః- రండు మిత్రులారా ? వేదిక కేగుదము. కావలి కారంభింపవలె.

మేః- ఇంతకుముందు పోయిన వీనిజూచితిరా ? నిజము నకు అతడుభీష్మునంతవానిదండనుండి నడిపింపదగినజోదు. కాని గమనించితిరా అతనిలోపము? అతని సుగుణ దుర్గుణములు విషువమందలి రేయుంబవళ్ళవలె సమదీర్ఘములై యున్నవి. పాపము వానిలోని శోచనీయమిదియే. కాని వీరసేనుడు వీనిపై బెట్టిన నమ్మకము వీనిచాంచల్యము పెడదిరిగిన ఏగడియన ఈ దీవిని గొడవలో ముంచునో అని నాగుండె లవియుచున్నవి.

రాః- అయితే అతడు తఱచుఇట్లే యుండునా?

వీరసేనుఁడు.

మే:- వాని నిద్రకీ ప్రస్తావన మెప్పుడును ఉండునదియే. త్రాగుడు, వాని నూచి జోకొట్టనిచో అహోరాత్రమిట్లేమేల్కొని యుండును.

రా:- ఇది సేనానిచెవినివేసిన బాగుండును. అతనికిది తెలియకనైనపోవలె. లేదా, అతనిమంచితనము సత్యకుని సుగుణములనుమాత్రమే మెచ్చి చెడుగులను త్రోసివైచిన ఉండవలె. అంతేకదా ?

ప్రవేశము నటేశము.

మే:- (రహస్యముగ) ఏమిసంగతి నటేశ! సరేకాని ఇప్పుడే దండపతి వెనువెంటపో. ఉండకు (వాడుపోవును)

రా:- అదిగాక ఆ పాండ్యమహాశయుడు తనపిమ్మట తనంతస్థానమును సాహసించి ఈరకపుధోరణిలో పాడుకొనిన వానిచేతబెట్టుట కడుశోచనీయము. ఇదిట్టిదని పాండ్యునకు తెలియజెప్పుట శుభ్రమగుపని.

మే:- అట్లెప్పటికిని చేయను.

ఉ॥ సత్యకు డన్న ప్రాణసదృశంబగు మిత్రముగావునన్, దివ
స్పత్యధికార మిచ్చినను, పాండ్యునితో దగునంచు వీని దు
ష్కృత్యము చెప్పనోడుదు; సఖిత్వముగల్గుకతమ్మునన్, జన
స్తుత్య పథమ్ముచేకొని, కుమర్తును, వీనిగుణమ్ము లన్నిటిన్.

వినువిను ఏమా అరపు? (లోన బాబో ! ఓయిబాబో !)

## ద్వి తీ యాం క ము.

పరివేశము నటేశమును తఱుముచు సత్యకసహం.

సత్య:- అరేగాడిద ! లుచ్ఛా.

రా:- ఏమిటేమిటి దండపతీ !

సత్య:- ఒకవిధవ నాకువిఘ్నులునేర్పుటా ? ఈ కుంకకు కొంకులు విఱుగ గొట్టెద.

నటే:- నన్నా కొట్టుట ?

సత్య:- ఇంకను ప్రేలెదవురా లుచ్ఛా ! (కొట్టును)

రా:- వద్దువద్దు దండపతీ ! నామాటవిని కొంచెమాగు. (ఆపును)

సత్య:- తమరు నన్నుపోనిండు—లేని-చో నీపుచ్చ-ఎగురును.

రా:- రా, రా, నీవు తాగితివిలే, రా !-

సత్య:- తాగితినా ? (కొట్టుకొందురు)

మే:- (నటేశముతో రహస్యముగ) ముందుపోఆవలకు-దొమ్మిఅని కేకలుబెట్టి గట్టవాయించు (వాఁడుపోవును) వద్దు సత్యకా! అయ్యో బాబో! బాబో! సత్యక! అయ్యోరాయల్! మీఁహూరుకొనుడు. దండపతీ ! హా రక్షింపుడు ! అయ్యో చచ్చెచచ్చె ! బలేకాపలా—(గంటమోగును) ఎవరా గంట కొట్టునది! కొఅవిదయ్యముబాబో! లంబాడీ దయ్యము. కాదు బాబో, గంటలబేతాళుఁడు !— ఎవరోరండు, హాఅయ్యో ఊరంతయు లేచును. దేవునితోడు, ఊరుకోసత్యక ! అందఱు నిన్నేనవ్వుదురు.

విగ్నేసను కం.

ప్రవేశము పరిచారకులతో వీరసేనుడు.

వీర:- ఏమీ గడబిడ ?

మే:- హాఁ ఆగుడు. ఆ ? దండపతీ ! అయ్యారాయల్ ! అందఱు పెద్దలు-ఎక్కడనుంటిమో ఎందుకుంటిమో మరచితిరా? ఆగుడు. మీతో మాటాడునది సేనాని. ఆ? సిగ్గులేదా ? ఆగుడు.

వీ:- ఆగుడు. మీప్రాణములు జాగ్రత. ఆ ?

రా:- అయ్యో నెత్తురు కాలువగట్టుచున్నది. నాకు చావుదెబ్బలు తగిలినవి. (పడిపోవును)

వీ:- ఎందుకు-ఎట్లువచ్చినది ? ఆ ? ఎప్పుడు ప్రారంభమైనదిది ? మనము మ్లేచ్ఛులముగామాత్ర, దైవము వైరులచే నిషేధించినపనిని మనకు మనమే చేసికొనుచుంటిమా ? మన జాతికిసిగ్గుగాని ఈ అలబరికొట్లాట నాపుడు. ఈతూగి ఎవడైనను కసితీర్చుకొనుటకు మొదలితేచాలు—, వానిప్రాణములు నిలువునపోవును. ఆ భీకర ఘంటానాదమాపుడు. ఆధ్వనితో గడ్డఅంతయు దద్దరిలుచున్నది. అసలువిషయమేమో ఈపెద్దలు చెప్పవలె. విచారముతో కుములుచున్నట్లున్నావు మేధావీ ? అంతయు నీపై బెట్టి అడుగుచుంటిని.- ఎవరు దీనికికర్తలు ?

మే:- నాకేమియు తెలియదు. ఇప్పటివఱకును తీయను పెట్టను ఉన్నవి హితులే, మంచిగా పేరుమ్రోగినపెద్దలే, అందఱు.

వీ:- ఏమీ విరుద్ధము?

మే:- కాదు. సహజమే.

తే॥ పాలకడలియు మందరపర్వతమ్ము.
మంచివే; హాలవిషముద్భవించె ? సూక్ష్మ
బుద్ధిగల యాలుమగలకు మొద్దుసంతు,
పుట్టనేమిటి? కేసు చెప్పుదురు జగతి?

ఏగ్రహము ఈమంచిమతులకు మాంద్యముకల్పించెనో కాని,- ఒకరిచావొకళ్ళు చూడవలయునంతటి ఘోరయుద్ధమునకుదిగిరి. ఈచిలిపి జగడమునకొక మొదలున్నట్లు తోచదు. కాని దాని తుదినిచూచుటకు నన్నిచటికి తెచ్చిన ఈరెండుకాళ్ళును ఏప్రసిద్ధ కృత్యమంటో విరిగియుండినను మంచిదే అనిపించుచున్నది.

వీః- ఇదెట్లుపొసగినది సత్యక? నీవే నిన్నిన్ని మరచుటా?

సత్యా:- క్షమించుడు. నోరెత్తలేను.

వీ:- రామరాయ! నీవు కడుయోగ్యుడవు. మొదటి నుండియు నీనిదానము, గాంభీర్యము, జగద్విదితముగాటచే బుద్ధి మంతులచేగూడ వివేకవంతుడవని ఎన్నికగన్నవాడవే-; అట్టి నీవు-; నీవిలువను ఇట్టి పోకిరిపేరుకుగా వ్యయపఱచి, నీ కీర్తిని పారబట్టుటకేమివచ్చినది? దీనికి సమాధానమీయవలె.

రా:- ప్రియసేనానీ! చావుకుదప్పితి. నీయుద్యోగి మేధా వియే చెప్పగలడు. నాకు తెలిసినంతవఱకు చెప్పనోరెత్తితినో,- ఇదిగో ఈపోటును భరింపలేను. తనప్రాణములకు వచ్చినపుడు ఆత్మరక్షణ చేసికొనుటగాని అందుకు యత్నించుటకుగాని దోసముకానిచో-నామొఱగినంతవఱకు-ఈరాత్రి నే నేమియు

పొరపాటుగనైనను, చెప్పిగాని, చేసిగాని ఉండలేదని ప్రమాణము చేయుచున్నాను.

వీ:- ప్రమాణసాక్షిగ—ఇక నాతీక్ష్ణత హేతువుగాని మర్యాదగాని చూడదు. నాకోపము మంచి నెమ్మగులను మఱుగు పఱచి పెనుదారితీయ జూచుచున్నది. కదలితినా,- లేక ఈచేయి పై కెత్తితినా.- మీలో ఘటికుఁడుగూడ మఱిచిపోవలె. మొదలే పాడుపోట్లాట ఎట్లువచ్చెనో తెచ్చినదెవరో నాకు చెప్పవలె. ఈనేరమున దూషింపబడి నాతఁడును నేనును ఒకే కాన్పునపుట్టిన కవలమైననుగూడ, నాకతఁడు లేనివాఁడే. ఏమిటి ? యుద్ధనిమగ్న మగు పట్టణములో— ఇప్పటికిని ప్రజాహృదయములో తొణికిస లాడు భయప్రవాహము రవంతయుఁదసలని ఈక్రూర నిశాసమయమున-కోటను సురక్షితముగ కాచుటకువచ్చిన మీరు— ఏకాంతగృహకల్లోలమునకీరీరున తలపడుటా? కేవలరాక్షసము. ఎవరుదీనికిక ర్తలు మేధావీ?

రా:- ఏస్నేహపక్షపాతముచేగాని, హోదాలో సంబంధముచేగాని—నిజమును పెంచిగాని త్రుంచిగాని-, చెప్పితివో-, నీవు సైనికుడవేగావు.

మే:- నన్నంతగ నొక్కవద్దు. నానోటినుండి ఈనాలుక నూడబెఱికినను సరేకాని, అది సత్యకమహాశయున కేకీడును చేయుట కిష్టపడదు. అయినను నిజముచెప్పినమాత్రాన వీనికి వచ్చినదేమియు లేదని నాకుధైర్యమేగనుక,— జరిగినదిదిప్రభూ!- రాయలును నేనును మాటలలోనుండగ ఎవడో విధవ రక్షింపు

డని అరచుచువచ్చెను. వానిపై ప్రయోగింప నిశ్చయించిన కత్తితో సత్యకుడు వానిని తరుముచుండెను. పాపమీ అమాయకుడు సత్యకున కడ్డుతగిలి ఆగుడని బతిమాలెను. నేనో?- ఆయేడ్పు విధవవెంటబడితిని. లేనిచో ఆబొబ్బలకు-అవిఅట్టివి గనుక-పురమంతయు అడలియుండెడిది. కాళ్ళు చుఱుకైనవగుటచే వాడు నాసంకల్పము మీరిపోయినాడు. సత్యకుని ఒట్టికేకలతోపాటు కత్తులచప్పుళ్ళువిని వెంటనే తిరిగితి. ఈరాత్రివరకు ఇతనినీస్థితిలో ఎప్పుడును చూచిఎఱుగ. నేనిట్లేవచ్చుసరికి-ఇదంతయు ఎంతలో - వారిద్దరును కలియబడి పేటుపోటులమీద నుండిరి. మీరు స్వయముగవచ్చి తీయుసరికి ఉన్నదేతీరు. ఇక ఈవిషయమున ఇంతకుమించి చెప్పలేను.

క॥ ఓదేవ!తప్పులెన్నగ బోదువె
మానవులు మానవులెజ్ఞుమ్మ ‘ప్రమా
దోధీమతా మపి’ యనం
గాదనరినధర్మ మూదగాదగు మనకున్.

కోపమున తెలియనివారు ఆప్తులనికూడ చూడరుగాన మనసత్యకుడు కొంత తొందరపడినను నిశ్చయమునకీతడా పారిపోయిన వానినుండి ఎంతటి ఓర్పుగూడ సహింపలేని గొప్పఅవమానమును పొందెననిమాత్రము నాకు గట్టినమ్మకము.

వీర:- నాకు తెలియునుమేధావీ—నీప్రేమా పరోపకారిత్వములు, ఈ విషయమును సత్యకునకుగా తేల్చివైచి తగ్గించి

చెప్పుచున్నవి. సత్యక ! నీపై నాకు ప్రేమలేకపోలేదు. కాని ఇకనుండి నాడుద్యోగిగా మాత్రముండకు.

(ప్రవేశము. పద్మాదేవి)

చూడుము అంతిమపురమునకెట్లు నిద్రాభంగమైనదో ! నిన్నొక ఆదర్శప్రాయునిగ జేసెద.

పద్మ:- ఏమిాసందడి ?

వీర:- ఇపుడంతయు కుదుటబడినవి దేవీ!- (రాయలుతో) ఆర్య ! మిాగాయములకు స్వయముగ చికిత్సజేసెద. వాని నావలకు గొనిపొండు. (మోయుదురు) పురమును జాగ్రతగచూడుము మేధావీ ! ఈ గంద్రగోళమునకు లేచినవారి కందఱకును ధైర్యము చెప్పు. దేవీ ! శమనకరమగు కునికిపాటు రణధ్వనిచే భంగమగుట సైనికునకెపుడును ఉన్నదే. (మేధావీ సత్యకులుతప్ప అందఱుపోదురు)

మే:- దెబ్బలు తగిలినవా దండపతీ ?

సత్య:- ఆ.- చికిత్సకుమించి.

మే:- దైవము రక్షించుగాక.

సత్య:- పేరు-పేరు-పేరు-అయ్యో నామంచిపేరు పోయినది. నాలోని శాశ్వతభాగముపోయి పశుత్వముమాత్రము నిలిచినది. నాపేరు మేధావీ ! నామంచిపేరు-

మే:- నేనూరకె నమ్మువాడనుగనుక నీశరీరమునకైదైన

గాయము తగిలినదేమో యనుకొంటిని. అట్లయినచో కొంచె మర్థమున్నది. కాని—

ఆ॥ పోవదగినచోటు పూర్తిగ మాని, పో
దగనిచోటి కరుగు జగతిలోన
కీర్తి; మనము దాని కేవల మొక బూట
కంపుతోడుగా గ్రహింపవలయు.

నీవేదోపోయినదనుకొనుచేగాని నిజమునకు నీకుపోయిన పరువే లేదు. ఎక్కడివాడవోయి! సేనానిని లోబరచుకొనుట కున్నవి మార్గములు.

ఉ॥ కుక్కనుగొట్టి గుఱ్ఱమునకుం దగు బుద్ధిని జెప్పినట్లు, నీ
కొక్కని కిట్లు సేత, పెఱయోధులనుఁ భయపెట్ట నెంచియే
దక్క మఱేమి గా; దిదియథార్థము; తాదృశులౌ విచక్షణా
దృక్కుగలట్టివారల చరిత్రము లిట్టులె యుండు మిత్రమా.

సత్య:- పనికిమాలిన, తాగుబోతైన, వివేకములేని- నేను, ఉద్యోగినై, అట్టిసేనానిని మోసగించుటకంటె నన్ను నీచాతినీచముగ చూడుమని వేడుదు. తాగుట? ఊరకె కలహించుట? కోతలా? ఒట్లా? తననీడతోనే పెద్దపెట్టున వివాదమా? ఓమద్యమా? ఏమి నీఅగోచరమహిమ? తెలియదగిన పేరేదియులేనిచో నిన్ను పిశాచిఅని పిలుతును.

మే:- అయితే కత్తిదూసి వెంటబడితివే ఎవడతడు? నీకేమిచేసెను?

సత్య:- ఏమో నాకు తెలియదు.

మే:- ఎచటనైనను కష్టా ఇది ?

సత్య:- నాకొకగంపెడు సంగతులు జ్ఞాపకమున్నవి. కాని అన్నియు అస్పష్టముగ. ఒకపోట్లాట-ఏందుకో తెలియదు. ఓ దైవమా! మానవులు తమమతులను కాజేయు ఒకకిరాత శత్రువునకు అఖండస్వాగతమిచ్చుటా ? మనము వినోదముగా తాగి త్రుప్పి మొప్పుకొని మృగములమై పోవుటా ?

మే:- ఎందుకు ఇపుడు సరిగనే ఉంటివికదా నీవు ? మఱల ఎట్లు స్వస్థపడితివి ?

సత్య:-

ఆ॥ త్రాగుడనెడి పిశాచి, తాదృష్టిపడి కోప
మనుపిశాచికిచ్చె దన నివాస
మొక్కలోపమింక నొక్కటిజూపి, న
న్ననఘ! నేనె తిట్టుకొనగజేసె.

మే:- నీవు మహానీతివేత్తవువలెనున్నావే. దేశకాలపాత్ర ములబట్టి ఇట్టిదివచ్చి పడకున్న బాగుండెడిదని మనఃపూర్వ కముగ కోరుచునేఉన్నాను. సరే-అయినదైనది గనుక, దానినీ కనుకూలముగ దిద్దుకొనవలె.

సత్య:- మఱల నాస్థానము నాకిమ్మందును. నేనొక తాగు బోతునని అతడు చెప్పబోవును. నాకు శేషునకున్నన్ని నోళ్ళు న్నను అట్టి సమాధాన మొక్కటే వానినన్నిటిగూడ మూయ

గలదు. ఇపుడు వివేకమున్న మనుష్యుడై, పిమ్మటబుద్ధిహీనుడై, ఇంతలో పసరమా? ఎమీావింత ? హద్దులేని ప్రతిగిన్నెయు పాప స్వరూపము. దానిలోని మిశ్రిత ద్రవ్యమొక పెనుభూతము.

మే:- చక్కగ నుపయోగించుచో మద్యమొక మంచి పరిచితభూతమే. ఇకదానిగుఱించి అంతగా వింతపడకు. అయితే నాదండపతీ ! నిన్ను ప్రేమింతునని తలతువని తలతును.

సత్య:- నాకదివరకే తెలియును. కాని నేను తాగుట ?

మే:- నీవేమి మఱొకడేమి ? ఒకప్పుడందఱును తాగుదురు. నీచేయవలసినది చెప్పెదవిను.మన సేనానీభార్యయే ఇప్పటి సేనాని. ఆమె తళుకులకు, పలుకులకు, కులుకులకు, ఆత్మార్పణ ముగావించుకొన్న పరతంత్రుడుగనుకనే, నేనిట్లు చెప్పుట.

క॥ ఆకనకాంగి యెదుట, నర
లేక, యథార్థమ్ము నుండెలిపి, నీపదవిఁ
నీకిమ్మని, వేఢింపగ
దే ! కృపగా, నూపిరాడనీయక, సఖుడా !

ఆమె, తన్నర్థించువారి కిబ్బడిగకూర్పకపోవుట, తనమంచికి పెద్ద మచ్చ అనుకొను, సదయయు, సరళయు, సుగుణయు, పుణ్యశీలయుగనుక, నీకును తేనభర్తకును నడుమువిరిగిన ఈ కీలును సరిజేయుమని ప్రార్థించు. ఈ నీపెళ్ళుమనిన మైత్రి ఆమెవలన వెనుకటికంటెగూడ మఱింతగ కుదుటపడుననుటకు నాదంతయు ఒడ్డెదను.

సః- మంచిసలహా చెప్పితివి.

మే:- హృదయపూర్వక ప్రేమతోనని గట్టిగనమ్ము.

సత్య:- నాకు తెలియును మేధావీ! ఉదయమైన వెంటనే పుణ్యశీలయగు పద్మాదేవిని నావిషయమై భారపడుమని వేడుకొనియెద. నా అదృష్టమిచట తప్పినచో నాకిక నిరాశయే.

మే:- మంచిదారిలోనుంటివి. సెలవు దండపతీ! నేను కావలికిబోవలె. (పోవును)

సత్య:- మంచిది మిత్రమణీ!

మే:-

వ:॥ తగుకోర్కెం దెలుపంగ, నేదయిన నౌదార్యమ్ముతో మేలు సే
యుగుణ ప్రస్తుత పద్మమూలమున పాండ్యుం ద్రిప్పనౌనంచు స
మ్యగుపాయంబును నమ్మగాదగు ననామ్యంబౌ గతిం, జెప్పుచుం
డగ నే నెట్టులుద్రోహినౌదు; నిటులన్నం బుద్ధియేయుండునే.

పద్మ, ధారాళములగు పంచభూతములవలె లోకోపకారిణిగా సృజింపబడినది. ఇక దానికి పాండ్యుని స్వాధీనపఱచుకొనుట అన్నది పరీక్షయేకాదు. వానిహృదయము, దానివలపువలలో తగుల్కొన్నది గనుక, పాపవిమోచన చిహ్నములగు చక్రాంకితములిచ్చిన, వానిమతము నూడబెఱుకుటగూడ దానికి తృణప్రాయము. కావలెనన్నచో సృష్టించి, అక్కరలేనిచో భస్మము చేయగలదు. వాని దుర్బలప్రకృతి దానిక్షుధకు బలియైపోవల-సినదే. ముఖ్యముగ సత్యకునిమంచికే ఇట్లుచెప్పు నేను, - వంచకుడ నెట్లగుదును? పైశాచికనీతి అనగా నిదియే. పిశాచములు కూడ నావలెనే మానవులనే చేయించబోవు ఘోరపాపకార్య

ములను ముందు స్వర్గతుల్యపుటాకృతులతో జూపి ఊరించును. ఈ బోళాశంకరుడు పద్మమూలమున తన అదృష్టములకై ప్రాకు లాడ, అది తన భర్తను సత్యకునకుగా పీడించునప్పుడు, పద్మ వానిపై తీపితో తిరుగరప్పించుచున్నదన్న ఈ విషశల్యమును పాండ్యుని హృదయములో నాటవలె. పద్మ సత్యకునకై ఎంత మంచికిబోవునో అంత చెడుగు తనభర్తవలన ఆమె పొందును. సుగుణవతియగు నామెను, ఒక ముకికిగుంటగా ప్రదర్శించి, దాని సౌశీల్యతూలమునుండి తీసినదారములతో వలపన్ని వీరిసందటను అందు తగిల్చెద.

ప్రవేశము నటేశము.

ఏమి విశేషణములు ? నటేశ !

నటే:- ఈ వేటలో, ముందుండు జాగిలమువలెగాక అఱచి ధ్వనిపూర్తి జేయు కుక్కవలెమాత్రము వెనుకనుంటిని. తెచ్చిన సొమ్ము తూర్పారబట్టితిని. పైగా ఈరాత్రి నాకు సక్రమమగు బడితపూజకూడ జరిగినది. ఇంతకు పర్యవసానము, నాశ్రమకంత మాత్రమనుభవ ముండవలెననియు ఇంతడబ్బుతో గడించిన కొంత తెలివితో ఇంటికిమఱలుట మంచిదనియు అనుకొందును.

మే:- ఆహా! నిదానములేని వారెంతదరిద్రులు ! కొంత కొంతగాగాక అంతయు ఒకేపెట్టున ఏగాయము మానును. మంత్రముతోగాక తంత్రముతో నడపుచుంటినని నీకును తెలిసి నదే. ఆతంత్రము వ్యవధిపై నాధారపడియుండును. అంతయు అనుకూలముగ వచ్చుటలేదా ? సత్యకుడు నిన్ను వీపునగొట్టెను.

సీహో-, ఆచప్పిడిదెబ్బతిని వానిపొట్టపై ఫడేలుమని శాశ్వతముగ గొట్టితివి. కొంచెమోసికపట్టు. ఉపయమైనది. సుఖముచేతను కార్యనిమగ్నతచేతను కాలమెంతైనను కొద్దిఅనిపించును. వెళ్లు నీవిడిదికి చేరుకో. కడమసంగతులు పిమ్మట తెలిసికొందువుగాక-వద్దు పొమ్మనుచున్నాను. (వాడుపోవును.)

జరుగవలసినవి రెండు. తన దేవేరియగు పద్మను నా భార్య సత్యకునకుగా కదల్చవలె. ఇపుడే దానినంపెద.

క॥ నేనింతలోన, మనసే
నానినిదూరముగగొని, తనదుసతి కేకాం
తాన, నాసత్యకుండు న
మోనము,యమునపుడమాంతముగ, దూకింతుగా,

అవును ఇదేమార్గము. (పోవుచు) 'అలస్యాదమృతం విషం'



# వీరసేనుడు

## [తృతీయాంకము]

### ఒకటవరంగము

కోటముంగిలి ప్రవేశము సత్యక విదూషకులు.

సత్య:- నీమిత్రుడు చెప్పునది కొంచెమువినుచుంటివా?

విదూ:- నామిత్రునిమాట వినుటలేదు. మీమాట వినుచుంటిని.

సత్య:- అబ్బ! నీచాతుర్యమాపు. సేనానిభార్యకు చెలికత్తెయగు నీలాంబరి నీకగుపడుచో సత్యకుడు కొంచెము వాక్సహాయమపేక్షించుచున్నాడనిమాత్రము చెప్పవలె. ఇదిగో ఈ కాసు పుచ్చుకో-చేయుదువా ఇది?

విదూ:- ఆ-దేవిగారి చెలికత్తె నాకీచాయనే కనిపించి తీరును. వెంటనే గ్రుద్దిచెప్పెదను.

సత్య:- సరే పొమ్ముమిత్రమా. (విదూషకుడు పోవును)

ప్రవేశము మేధావి.

సమయమునకు వచ్చితివి మేధావీ!—

మే:- ఇంతకు వెన్ను వాల్చనేలేదన్నమాట.

సత్య:- ఎక్కడిది? మనము పోకమునుపే తెల్లవారినది.

ఉ॥ రాతిరిసంభవించిన పరాభవమీగెడు నాత్రమొంది, యి
ద్దే తెగియించిసుమ్ము పిలిపించితి నీసతి; నెంచబోకు, నీ

చేతమువందు; నింతకు నుశీలను నీలకు వేడుకెల్ల, ప
ద్మాతరుణీమతల్లి శుభదర్శనభాగ్యము, గూర్పనేజుమీ.

మే:- నీవద్దకిపుడే పంపుదును. నీసంభాషణయును పనియు మఱింత స్వేచ్ఛగ జరుగునట్లు ఏదేని ఒకమిష కల్పించి పాండ్యుని దూరముగ గొంపోయెద.

సత్య:- ఇందుకెంతయు కృతజ్ఞుడను. (మేధావిపోవును.) నావారిలోగూడ ఇట్టిమంచి నింతవఱకెఱుగ.

ప్రవేశము నీలాంబరి.

నీ:- దండపతీ! నీభంగపాటు కెంతయుచింతఅగుచున్నది. అయినను త్వరలోనే చక్కబడును. సేనానియు దేవియు నిదే చర్చించుచున్నారు. ఆమెనీకొఱకు గట్టిగా వాదముచేయుచున్నది. అతడు ఇట్లు సమాధానము చెప్పుచున్నాడు.

ఉ|| రేయిని, నట్లునీవుప్రహరించినతండు, స్వబంధులండమెం
డై, యశమున్నమేటియట; ధైనను, కాదనడట్టెనీకు; నిం
కేయతడైననచ్చుడట; యెట్లొకొ, కెంటనెనీకు నీపదం
బీయుటయుంచు నాగెనట; యింతకునీయెడవైరమున్నదే.

సత్య:- ఇది చేయదగినదిగా నీకుతోచినచో పద్మాదేవితో క్లుప్త ప్రసంగమునకు ఒంటరిగ అవకాశమిప్పింపుమని నాకోరిక.

నీ:- అట్లయిన లోనికిరమ్ము. నీహృదయమును విప్పి చెప్పుకొనుట కవకాశముగలచోట నిన్నుంతును.

సత్య:- నీకెంతయు కృతజ్ఞుడను. (నిష్క్రమణము)

తృతీయాంకము.

రంగము 2. కోటలోగది.

ప్రవేశము: మేధావి, వీరసేనులు, పౌరులు.

వీ:- ఈయుత్తరములు మేధావీ! నావికునకిచ్చి వాని మూలమున ప్రభుత్వమునకు నావిధులనెరవేర్పుము-అపని ముగియగనే-నేనీ కట్టడములపైననే తిరుగుచుందును- నన్నువచ్చి కలియుము—

మే:- చిత్తము అట్లే చేసెదను.

వీర:- మిత్రులారా! ఈకోటను చూచితిరా?

పౌ:- చిత్తము—ముందిటు చూచితిమి. (పోవుదురు)

రంగము 3. కోటలోవనము.

ప్రవేశము నీలాంబరి, పద్మ, సత్యకుడు.

ప:- నీకై సత్యక! నాసర్వశక్తులు వినియోగింతునని మాత్రము ముమ్మాటికి నమ్ము.

నీ:- మంచిది దేవీ! అట్లేచేయుము. ఈస్థితి తనకే మూడినట్లు నాభర్త వగచుచున్నాడనిమాత్రము ప్రమాణము చేయగలను.

ప:- అవును. అతడు చాల జాలిపేగులవాడు. సందేహింపకు సత్యక? నిన్నును, నీసేనానిని మఱల ఎప్పటివలె మిత్రులను చేసెదనులే.

స:-

ఆ॥ సత్యకునకు నేమిసంభవించినను నో
దేవి! మీ యథార్థసేవకుండె

గాని యన్యుఁడేమిగాఁ జెప్పటికి; గాన
నతని నరయుము భారమంత నీదె.

ప:- ఎఱుఁగుదును సత్యక! ఆర్యపుత్రుని నీవు ప్రేమించు మాట నిజమే. దీర్ఘకాలమునుండియు వానినెఱుఁగుదువు. ఐనను ఆతఁడిట్లు ఎడమొగముగా నుండుటంతయు వ్యావహారికపు బెట్టు తప్ప మఱేదియు కాదని నిశ్చయించుకో.

సత్య:- అవును తల్లీ! కాని, నేనిప్పుడు సమక్షమున నుండక, నాస్థానము నింపఁబడినచో, సేనాని నాసేవాప్రేమలు మఱచునట్లు ఆవ్యావహారికము దీర్ఘకాలముండినను ఉండవచ్చు--, లేదా ఇట్టిదుర్బలపుసున్నితములు దానినిబలపఱచినను పఱుపవచ్చు--, లేదా పరిస్థితుల ననుసరించి తనకై తానె పెఱిగినను పెఱుగవచ్చు.

ప:- ఆ అనుమానము పెట్టుకొనకు.

శా॥ ఈ నీలాంబరియొద్ద, నీపదవి నీదేయంటిపొమ్మింక; సుం
తైనన్ భీతినిజెందబోకు సఖ!; స్నేహంబందు నేనొక్క వా
గ్దానంబున్ బొనరించుచో, చివరముక్కంగూడ పోనీక, య
ద్దానిన్, సార్థముజేయు సాంతమును పంతంబూనియుందుంజుమీ!

నావిభున కింకొకటి తోచనీను. అతఁడు మచ్చికపడువఱకు కనుమూయనీయక పిసుగుపుట్టునట్లు మకురుపట్టు పట్టెద. వానికి, తనపాన్పు, బోధకొఱకేర్పడిన ఒకచదువులబడివలెను, భోజనము, ఈపాప ప్రాయశ్చిత్తార్థమేర్పడిన పంచగవ్యమువలెను తోచవలె. ఇంతెందుకు? అతఁడుచేయు ప్రతిపనిలోను నీసంగతి కలిపెద.

తే॥ కాన నీవ నుత్సాహివిగాగవలవ;
దన్న ! నీకుగా ప్రార్థించునన్న విభుడు
నటేకినటా సరేగాని, నీకొఱకుసేయు వాద
మూపిరియున్నంతవరకు విడువ.

నీః- దేవీ ! ప్రభువు వచ్చుచున్నాడు.

సః- అమ్మా, సెలవుపుచ్చుకొందును.

పః- ఎందుకు ? ఉండి నేచెప్పునదంతయువిను.

సత్యః- ఇపుడుకాదుతల్లీ ! నాస్వకీయములను సమర్థించు కొనునంతటి స్వస్థతలో లేను నేను-

పః- సరే నీయిష్టము—(సత్యకుడు పోవును)

పరివేశము మేధావీ, వీరసేనులు.

మేః- ఆ !—అదేనాకుగిట్టదు.

వీః- ఏమిటి అనుచుంటివి ?

మేః- ఏమియులేదుప్రభూ! కాకపోయినను,- నాకేమియు తెలియదు.

వీః- సత్యకుడేకదా ఇప్పుడునాగ్రేయసినద్దనుండిపోవుచున్నది?

మేః- సత్యకుడే ప్రభూ ! కాదు-, నిజముగా తమరాక జూచి అతడు ఇంతదొంగవలె పెడపెడగాపోవునని నేననుకొనను.

వీః- అతడనియే నానమ్మకము.

పః- ఏమివిశేషములు ప్రియా ! మీా ఆగ్రహమున కృశించుచున్న ఒక అభ్యర్థితో ఇంతవఱకును మాటాడు చుంటిని-

వీః- ఎవరతడు ?

ప:- ఎవరు ? మీదండపతి సత్యకుడు ప్రభూ !

ఆ॥ మిమ్ముగోర నాకు ముమ్మాటి కనురాగ,
మధికృతియును గల్గినట్టులైన
వానిపూర్వమైత్రి ప్రాణేశ! మీనిష్క
శంక కరుణలో మెలంగనీవె.

అతడట్లు ప్రమాదవశమునగాక-, కావలెననిచేసియుండి, తమ యెడ హృదయపూర్వక భక్తివిశ్వాసములు లేనివాడేఅగుచో-, అమాయికముఖము కనిపెట్టుటలో నాకు తెలివియే లేదన్న మాట-. నాయందు దయయుంచి అతని బిలిపింపుడు.

వీ:- ఇపు డిచటినుండి వెళ్ళెనా ?

ప:- అవును- అతనితోపాటు కృశించుటకు తనదుఃఖములో ఒకపాలు నాకువదలిపెట్టి మీయెదుటపడలేక పోయినాడు. అతనిని పిలిపింపరా ?

వీర:- ఇప్పుడుకాదుగాని ఇంకొక్కప్పుడు.

ప:- త్వరలోనేనా ?

వీర:- వీలైనంత త్వరలో.

ప:- అది ఈరాత్రి భోజనవేళకేనా !

వీర:- కాదుపద్మా! ఈరాత్రికి కాదు.

ప:- అయితే రేపుమధ్యాహ్న భోజనమప్పుడా?

వీర:- రేపింటివద్ద భుజింపను. దుర్గమువద్ద నాయకులను కలిసికోవలె.

ప:- అట్లగుచో రేపురాత్రికి. లేక మంగళవారపు టుదయము. ఏదో ఒకప్పుడని తేల్చిచెప్పుడు. కాని మూడుదినము

లకుమాత్రము మించనీయకుడు: నిజమునకు చాల కుములు చున్నాడు. యుద్ధములలో ఘటికులనే ఆదర్శప్రాయముగ శిక్షించి ఇతరులకు బుద్ధిజెప్పవలయు నియమమునకుగాని చో— ఎంతయోచించినను ఆహద్దుమీరుటలో ఇంత గద్దింపును పొంద దగిన తప్పిదమున్నట్లు తోచదు. అతడెప్పుడు రావచ్చునో చెప్పరా?

మ॥ ఒకటేదేనియు మీరునన్నడుగ, నౌనో కాదో. యోచేని తే
ల్చక, మిమ్మెక్కుడు కాలమాత్రమున నిల్వంబెట్టి వేధించి, యి
ట్లొకదా యన్యులకంచు మీపదికి నాటింపంగ యోచించి, యో,
పికతో.'నాతడె యెప్పుడా ?' యనుచు, నువ్విళ్ళూరుచుంటింబ్రియా!

మనవివాహమునకు పూర్వము సత్యకుడు మీతో తఱచువచ్చెడి కాలమున నేను మీపరోక్షమున మిమ్ముగూర్చి వ్యతిరేకముగా ప్రసంగించినపుడెల్ల మీపక్షము వహించెడివాడు. అట్టి ఈతని దెచ్చుటకా ఇంతపాటిప్రయాసము— నేనెంతకైనను తగుదు నను కొనుడు.

వీర:- అబ్బ! ఇకనక్కఱలేదు—అతని కిచ్చవచ్చినపుడు రానిమ్ము—, నీకేదియు కొదవనను!

ప:- అబ్బో! నాకు మహద్భాగ్య మొఱగించినట్లు గాబోలు. మిమ్ముమధురాహారములు గొనుడని, పాదరక్షలు ధరింపుడని, అత్యంత సౌఖ్యప్రదములైన వానిని కూర్చుకొను డని—, ప్రార్థించుటవంటిదే ఇదికూడ. ఇదిచేసినచో నాపై మీకు గల అత్యంతప్రేమను వెల్లడించినట్లా? కాదు.

ఉ॥ ప్రేయసియందు, మీకు నభ్యేపుడ, యెంతొ, పరీక్ష చక్కఁగా
చేయఁగ. నొక్క కోరిక వచింపుము నేని, ననుగ్రహింప శం
కాయుతమై, నితాంతభయ కారణమై, బహుకష్టసాధ్యమై,
మీయెదకద్దితోచవనె; మీపకయిప్పుడు తేలఁగ వలెన్.

వీర:- నీకేదియుగాదనను. కాని, ఒక్కక్షణముమాత్రము నన్ను ఒంటరిగ విడిచిపొమ్మని కోరుచున్నాను.

పద్మ:- మీకు కాదందునా? లేదుప్రియా! సెలవు.

వీర:- వెళ్ళు పద్మా-వెళ్ళు-ఇప్పుడే వత్తును.

ప:- రా-,నీలా! తమమనసువచ్చి సట్లుండుడు. తమ రెట్లున్నను ఎప్పటికిని మీదాననే. (నీలా పద్మలు పోదురు)

వీర:- పిచ్చిపిల్ల! నామనోవృత్తి ఎన్నికష్టముల పాలై నను నీప్రేమ వదలను. కాని నిన్ను ప్రేమింపనినాడు నాకు మహా ప్రళయము వచ్చినదన్నమాటే.

మే:- మహాప్రభూ!

వీర:- ఏమో అనుచుంటివి మేధావీ?

మే:- అయితే తమకును దేవిగారికినిగల అన్యోన్యము సత్యకమహాశయునకు మొదటినుండియు తెలియునా?

వీర:- అవును, మొదటినుండియు తుదివఱకును చక్కగ తెలియును. ఎందుకు ఇట్లడుగుచుంటివి?

మే:- మఱేమియులేదు. కేవలము నామనస్సంతృప్తి కొఱకే.



వీర:- ఏమి తెలిసికొందువు మేధావీ?

మే:- అదికాదు. ఆమెతో వీనికింతపరిచయమున్నదని నాకిదివఱకు తెలియదు.

వీర:- అవును. మాయిరువురి నడుమను తిరిగినమాత్ర యితడే.

మే:- నిజముగా?

వీర:- నిజముగా! ఆ—నిజముగ. నీవిందులో ఏమో ఆరాతీయుచున్నావే! మంచివాడు కాడా అతడు?

మే:- మంచివాడేప్రభూ—

వీర:- అవును చాలమంచివాడు.

మే:- నాకు తెలిసినంతవఱకుప్రభూ!

వీర:- ఏమిటి ఆలోచించుచున్నావు?

మే:- ఆలోచించుప్రభూ!

వీర:- ఆలోచించుప్రభూ? దైవసాక్షిగ ఈభావములో ఎవరికిని చూపరాని భయంకర భూతమేదియో ఉన్నట్లు ధ్వనించుచున్నది. నీవేదియో వేరుగా భావించుచున్నావు. ఇంతకుముందే సత్యకుడు నాప్రేయసివద్దనుండి పోయినపుడు "నాకదేగిట్టదు" అనగా వింటిని. నీకుగిట్టనిదేది? నాప్రేమరంగములో అతడే నామంత్రిఅని చెప్పినపుడు 'నిజముగా?' అని అఱచి నీతలలో ఏదియో ఘోరభావము నిగూఢము చేసినట్లు కనుబొమలు చిట్లించితివి. నాయెడ నీకు ముమ్మాటికిని ప్రేమయే ఉన్నచో నాకు నీహృదయము జూపు.

మే:- ప్రభూ మిమ్ము ప్రేమింతునని ఎఱుగుదురా?

వీర:- చక్కగ నెఱుగుదు.

ఉ॥ సలలితశక్తి నమ్మకమె సంగడి బంటువు నీవనాకు; నీ
పలుకుల దూచపంపక నొకపట్టున నూపిరి పోయవచ్చు, నే
దెలియుదుగాన, నీవెనుకతీయుటలుం, గుదియించినక్కటల్,
గలవరపెట్టెమిన్కుటముగా, నను; కార్యధురీణ! యియ్యెడన్.

ఇట్టివి అవిధేయుడగు టక్కరిదొంగలలో స్వాభావికపు జిత్తులు గాని, ధర్మాత్ముడగు వానిలో మాత్రము ఉద్రేక మాపలేనట్టి హృదయములో పనిచేయు భావసందిగ్ధములు - అనుమానపు టాఘుటలు.

మే:- కాని సత్యకమహాశయుని విషయమున అతడు విశ్వసనీయుడనియే నానమ్మకము.

వీర:- నేనును అట్లే అనుకొనుచుంటిని.

మే:- ఆహా! లోకమెంతపాడుది.

తే॥ మానవులుపైకి దోచెడిమాదిరిగనె
యుండవలెగాని యట్లుండకుండువార
లేమియుగదోచకున్న మేలెంతొ గలుగు.
గోముఖ వ్యాఘ్రరీతి లోకులకుకీడు

వీర:- నిశ్చయము. మనుష్యులుపైకి కన్పించునటులే ఉండవలె.

మే:- ఇంకేమి ? సత్యకుడు మంచివాడే అనుకొనవచ్చు.

వీర:- ఓ, కాదుకాదు. దీనిలో ఇంకను కొంతయున్నది. మేధావీ! నీవునీభావములతో మాటాడుకొనునట్లు, మాటమాటికి తలపోయునట్లు, నీనికృష్టభావములకు నికృష్టపదములు ఉపయో

గించినాతో స్పష్టముగ చెప్పు.

మే:- మహాప్రభూ! క్షమింపవలె. నేను సేవాధర్మమునకు మీకెంత కట్టుబడియుండినను, దానిసలకు సైతము స్వేచ్ఛగల పనులలో మాత్రము బద్ధుడను కాజాలను. నాభావములను తెలి పుచ్చుటా? ఎందుకు, అవిశ్వాసములే, నీచములే అను కొనుడు. సమయముబట్టి తమంత తామే మలినములు తోరబడని తావేదిగలదు? కొన్ని అయినను అపరిశుద్ధభావములు లేక కేవల న్యాయచింతతో ఏతీర్పరి విచారణాసభలో ధర్మపీఠమెక్కును?

వీర:- నీహితుడు వంచింపబడినట్లు తెలిసికూడ నీభావ ములకతని చెవిని పరాయిదిగా చేయుచో మేధావీ!, నిజముగా అతనియెడ ద్రోహము చేయుచున్నవాడవే.

మే:- అయితే, ఒకవేళ నాఊంచన పాపభూయిష్ఠమే కావచ్చు. రంధ్రాన్వేషణమే నాస్వభావములోని పెద్దరోగ మనియు నాఅనుమానము లేనిచెడుగులనుగూడ కల్పించు ననియు ఒప్పుకొనుచునే ఉంటినిగనుక-మలినముగా అర్థముచేసి కొను నన్ను, ఒక లెక్క చేయకుండుటకును, అట్టివాని అనా లోచిత, నిశ్చయరహిత, దృష్టినే ఊతముగాగొని మీకై మీరే దుఃఖహర్మ్యమును కట్టుకొనకుండుటకును, మీవివేకము నుపయోగింపవలెనని నామనవి. నాభావములను తమకెఱి గించుట మీప్రశాంతికిని మంచికినిగాదు సరిగదా, నావివేక విశ్వాస మానవత్వములకు రవంతేయు దగవు.

వీర:- ఇంతకు నీఅభిప్రాయమేమి?

మే:- మహాప్రభూ !

ఆ॥ భువినిమంచి పేరె పూరుషునకునైన-,
కాంతకైన పెట్టకయ వెలుంగు
శాశ్వతంబుభూష: సరకుసేయఁదగదా.
ఇట్టిదానినొక్కఁడేనిజనుడు.

నాడబ్బును దొంగిలువాఁడు పిప్పిని దొంగిలుచున్నాఁడు. అది కేవలచంచలము. ఏమియులేనిదే. అది ఇంతకుమునుపు నాది. ఇప్పుడువానిది. ఇదివఱకు లక్షలకు బానిసయైనాకడకు వచ్చినది. కాని స్థిరముగు నామంచిపేరును హరించువాఁడు తనను ధనికుని జేయఁజాలనిదియు, నిశ్చయమునకు నన్నుదరిద్రుని జేయఁగలదియు, నగుదానిని దొంగిలుచున్నాఁడు.

వీర:- దైవసాక్షిగ, ఇక నీభావములను గనుఁగొందును.

మే:- నాహృదయము మీ అరచేత బట్టినను చేతగాదు. ఇక నాఅధీనమందున్నపుడు బొత్తుగసున్న.

వీర:- ఆ ?

మే:-ఓ!- అనుమానమునుండి మాత్రము జాగ్రత్తప్రభూ! ఆపసరుకన్నులరాకాసి తాను దిను నంజుడునే పరిహసించును. తనకర్మమింతియేఅని తన అపచారిణిపై మనసు విఱిచుకొనిన అంకుటాలిమగఁడు సుఖించును. తన భార్యను ప్రేమించుచుగూడ అనుమానించుచు అసూయపడుచు అప్పటికివిదలలేని యా శంక,- నరకప్రాయపు నిమేషములెన్ని ఎట్లుగడపునోకదా ?

వీర:- ఎంతగ్రహచారము!

మే:- ఏదో ఒకతృప్తిఉండవలె. తృప్తిఉన్నచో పేదఱి కముగూడ భాగ్యమే. కాని ఎప్పటికైనను పేదవడుదునోయని ఎప్పుడును ఉలికిపడువానికి మేరువుండియు శివాలయమువలె దరిద్రమే. ఓదైవమా! నాతోడివారి అందఱి అంతరాత్మలను అనుమానమునుండి మాత్రము రక్షింపుము.

వీర:-ఇంతెందుకు? చంద్రగమనములోనిమార్పులనుగూడ నిరంతర నూత్నశంకలతో గమనించునంతటి శంకాలోలముగా జేయుదుననుకొంటివా నాజీవితమును? లేదు. ఒకమారుశంకలో పడుట ఎప్పటికిని నిశ్చయించుకొనుటే, నామనోవృత్తిని-, నీవు గ్రహించినదానికి పోల్చుకొనుచు, అట్టి గాలిపోతలకును, ఫుల్లు లెక్కించుటలకును, అధీనముచేసినచో, నన్నొక చింబోతుక్రింద గట్టుము. ఏదిఎట్లున్నను, నాభార్య అందగత్తెయని, భోగలాలస యని, విరివిగ మాటాడునని, మధురముగ పాడునని, చెప్పుట నన్ను శంకాగ్రస్తుని జేయుటగాదు.

చ॥ గుణవతియైనచో, నివియగుఁ గుణముల్ ద్విగుణమ్ముగాగ ; మ
ద్గుణముల నేమిలోటయినగూడ, ననుఁ సతిమోసగించునఁ
కణమును, సందియమ్మును, భయమ్మునుగా; వెఱులన్న నీ సారసే
క్షణ, కనుగొంటకుఁ, కనులుంగల్గియె, యేరుకొనెంగదా, ననుఁ.

కాదు. మేధావీ! అట్లెప్పటికినిగాదు. కొంతయైనను చూచిగాని శంకింపను. శంకించిగాని రూపింపను. నిరూపణపై, ఇదితప్ప మఱొకటిలేదు. వెంటనే ప్రేమనో శంకనో వదలుకొనుటే.-

మే:- ఇప్పుడు నామనసు కుదుటబడినది. తమయెడ

నాకుగల సేవా ప్రేమలు మఱింతస్పష్టముగ చూపుటకు దగు హేతువున్నది. కాన మీకు బద్ధుడనగు నావలననుండి ఇక గ్రహింపుడు. ఇప్పటికిని నిదర్శనముమాట చెప్పను. మీభార్య వంకజూడుడు. సత్యకునితో నున్నపు డామెను గమనింపుడు. ఏమియు నెఱుగనట్లుండి ఒక కన్నటుపెట్టుడు. మీనిష్కపట సరళస్వభావము, దానిఔదార్యము మూలముననే వంచింపబడు టకు నేనోర్వను. చూచితిరా, మాదేశలక్షణములు! నాకు బాగుగ తెలియును. కటకములో స్త్రీలు తమ దుండగములను భగవంతుడుచూచుటకైనను ఒప్పుదురుగాని, భర్తల కాపాల కువయే పొడకట్టనీయరు. వారి నైతికాదర్శము చేయకుండ విడచుటగాదు,- తెలియకుండ దాచుట.

వీర:- అట్లందువా ?

సే:- మిమ్ము చేపట్టి తనతండ్రిని మోసగించినది. మీ చూపులకు భయపడి వడకినట్లు నటించినపుడు మిమ్ములను మిక్కుటముగ ప్రేమించినది.

వీర: అవును అట్లేచేసినది.

సే:- పోనీ. ఎందుకు ? అంతచిన్నతనముననే గానుగ ఎద్దుకువలె తనతండ్రికి గంతకట్టుటకు ఆరకముగ నటింపగలిగి నది. అతడేదో ఇంద్రజాలమనుకొన్నాడు. ఇంతకు నాది మహా పాపము. నాకు మీపై అవసరమునుమించిన ప్రేమయున్నం దుకు క్షమింపుడని ప్రార్థన.

వీర:- నీమేలెప్పటికిని మఱువను.

మే:- కాని మీలోనిబిగువును ఇదికొంత సళ్ళించి నట్లున్నదే!

వీర:- లేదు. లేదు. ఏమాత్రమునులేదు.

మే:- చూడగా మీధైర్యము తగ్గినదనియే నానమ్మకము. ఈ చెప్పినదంతయు తమపై ప్రేమతోనని తలతురను కొందును. కాని, అదిగో! మీలో మార్పుగపడుచున్నది. ఒక్కశంకించుటకుతప్ప-, విశేషార్థములకుగాని, లేనిపోనిసిద్ధాంతములకుగాని నావాక్కులను శోధింపకుడని నామనవి.

వీర:- అట్లెప్పటికిని చేయననుకో.

మే:- తమరట్లుచేసినచో ప్రభూ! నాభావములు లక్ష్యములుగా ఉంచుకొనవి తుచ్ఛపర్యవసానములకుగా నావాకులుపయోగపడినట్లగును. సత్యకుడును నాకు ముఖ్యహితుడే. కాని తమముఖము వ్వాడబాఱినట్లున్నది!

వీర:- లేదు. అంతగలేదు. కాని పద్మ, నిష్కళంకయే అనితోచుచున్నది.

మే:- ఆమె చిరకాలమట్లేబ్రతుకుగాక! ఇట్లనుకొనుచు మీరును చిరకాలము బ్రతుకుదురుగాక!

వీర:- అయినను దానిప్రకృతిలో ఇట్టివైపరీత్యమా?

మే:- అదిగో గమనింపవలసినదే అది. ఇక తమయెదుట కొంత తెంపుజేయుచున్నాను. మన కనులగట్టినట్లు, ప్రకృతి ఊరించు అన్నివిషయములు-, అనగా తనజాతి, రంగు, ఉన్నతి-, గల ఎన్నో సంబంధములను తృణీకరించిన ఆకామోద్రేకములో-

ఛీ, ఛీ, తుచ్ఛవైరుధ్యమును, అస్వాభావికపుటూహలను ఎవరైనను పసిబట్టవచ్చు. ఇట్టి విషయములో ఆమె ఒక్కతెయే అని చెప్పటగాదు. కాని క్షమింపవలె-ఆమెబుద్ధి వెనుకటికంటె తెలివినపడి తన జాతిమూర్తులతో మిమ్ము పోల్చుకొని పశ్చాత్తాపపడునేమో అనికూడ భయమగుచున్నది.

వీర:- సరేపో- సరేపో. ఇంకను విశేషములు తోచినచో వెంటనే తెలియబఱచుము. కనిపెట్టుటకు నీభార్యను పంపు.

మే:- నాభార్య ? ఇట్టివానిలో మునివలె మౌనము దాల్చును. ఒక్కనాభార్యయే కాదు.

మ॥ మనకేమయ్యెనటంచు గొంద, అఘముంబాటించియుం గొంద, ఊ
కొనినంగాని, దురాగతంబులు భువింగొండంతలై పోవు: అం
కునకుంబూనినదెల్ల నెప్పటికి లోకుల్ భర్తకున్నైజవ
ర్తనముక్ పేర్కొని కొంపకూల్చరను ధైర్యంబూని యుండుంజుమీ.

కాని నామతముమాత్రము దేనిసంగతి దానిభర్తకే జెప్పినగాని ఇంకొకదానికి బుద్ధిరాదని.

వీర- సరేపో-మేధావీ! సరేపో.

మే:- (పోవుచు) ప్రభూ ! సెలవు పుచ్చుకొందును.

వీర:- నేనెందుకు పెండ్లాడితిని ? ఈ నిష్కపటజీవి నిశ్చయముగా తను బయటబెట్టుదాని కిబ్బడిగా ఎఱుగును.

మే-: (వచ్చుచు) ప్రభూ ! ఈవిషయమునంతగా విమర్శింపకుండుటయే మంచిదని నాప్రార్థన. దానిని కాలమునకు వదలివేయుడు.నిశ్చయమునకు ఆ ఉద్యోగమును కడుసమర్థతతో

నిర్వహింపగల వాడతడేగనుక, సత్యకుడు తన స్థానమును తరిగి తానుపొందుట మనకు మంచి దేఅయినను-, కొంతకాలమువఱకు ఏదియు తెగజెప్పక అతనినట్టేఉంచినచో, వానిని వానిఎత్తుగడలను చక్కగ తెలిసికొనవచ్చు. అతని రప్పించుటకు మీరాణి మిమ్ము త్వరపెట్టి బలవంతముగ పీడించునో గమనింపుడు. అందులో మీకు మఱింతగ గోచరించును. అనవసరపు జోక్యముతో అధిక ప్రసంగము చేసితినో అని జడియుచుంటినిగాన—ఈ లోపుగ ఆమెపై ఏఅపోహయు పడకుడని నామనవి.

వీర:- నీవు నానిగ్రహశక్తికి జంకకు.

మే:- చిత్తము. మఱల సెలవుపుచ్చుకొందును. (పోవును)

వీర:- నిజమునకితడు మహావిశ్వాసపాత్రుడు. విచక్షణాదృష్టితో మానవ ప్రకృతిలోని అన్నిగుణములను చక్కగా ఎఱిగినవాడు. నాభార్య నాకు స్వాధీనపడని తోక తెగిన గాలిపటమే అగుచో, దానిదారము నాహృదయ రక్తనాళమే అయినను ఆదారము త్రెంపి దాని అదృష్టము చెట్టుననో పుట్టనో చూచుకొనుటకు దానిని ఈలవైచి గాలికి వదలెదను. ఒకవేళ, నల్లగనుంటిననియా?- లేక తళుకు బెళుకుల సోయగాండ్రవలె రసికత్వము లేదనియా? లేక ఈడుజోడులేక ముదిబారితిననియా? అయినను అది అంతగలేనేలేదు. ద్రోహముచేసినది? నాబ్రతుకెంతచులుకనైనది! దానినసహ్యించుకొనుటచేతనే ఇక నాకు చిత్తశాంతి. వారివాంఛలుగాక ఈ సుకుమారజీవులు మాత్రమే మనవని చెప్పకొనునట్టి వివాహములోనిగ్రహచార

మెంతటిది ? పరోపయోగార్థము నాప్రేమించు వస్తువులో ఒక మూలమాత్రమే నాకుగా ఉంచుకొనుటకంటె ఒక కొండచిలువనై మన్నుదినుచుండుట మేలు.

తే॥ గొప్పవారలయిండ్లలో గూడనిదియె
కలుగు పెనురోగ: మధికులకన్ననిందు
హీనులే మేలు: నిజమున కెవరుదీని
దొరియగా లేరుగాదె మృత్యువునుబోలె.

ఈద్రోహప్రారబ్ధము మాయిరువురకును మాతృగర్భముననే గీయబడినదిగాబోలు. పద్మ వచ్చుచున్నది.

ప్రవేశము: నీలా, పద్మలు

ఇదియే ద్రోహియగుచో ఛీ-ఛీ-, దైవము తన్నే పరిహరించుకొనును. నేనిది నమ్మను.

ప:- ఏమి విశేషములు ప్రభూ ! మీ అతిథులు మీకై నిరీక్షించుచున్నారు.

వీర:- నాదే లోపము.

ప:- హీనస్వరముతో మాటాడుచున్నారే ! సరిగ లేదా మీకు ?

వీర:- తలంతయు దిమ్ముగనున్నది.

ప:- ఇది నిద్రకాచినందుకు వచ్చినది. నన్ను గట్టిగ బిగించి కట్టనిండు. త్వరలో తప్పక నెమ్మదించును.

(రుమాలు తీయును)

వీర:- నీరుమాలు చిన్నది. (తన రుమాలుతీయును. పద్మది పడిపోవును) దీనితోకట్టు. లోనికిపోదము రమ్ము.

ప:- మీతలనొప్పిమూలము నామనసు సరిగాలేదు.

(పద్మతో వీరసేనుడు పోవును.)

నీ:- ఈరుమాలు నాకేదొరకినందుకు ఎంతయు సంతస మగుచున్నది. పాండ్యునొద్దనుండి ఆమెకువచ్చిన ప్రథమ లాంచనమిదే. చంచలుడగునాభర్త దీనినికాజేయుమని వందల సార్లు కోరియున్నాడు. కాని.-

ఉ॥ ఎప్పటికేని బాయకు; సఖీ! ఇది లాంఛనమంచు నెన్నియో
చెప్పి ప్రమాణముల్, కుదురుచేసి విభుండిడెంగాన, నీమలా
గెప్పుడు బాయకుండి మనసెంతయు చేయుచు దీనితోడ మా
యొప్పులకుప్పపద్మ సరసోక్తుల బల్కుచు ముద్దులాడెడున్.

ఈపనితనముతో ఇట్టిదింకొకటి తయారుచేసి నాభర్తకిత్తును. దీనితో అతడేమిచేయునో దైవమునకేగాని నాకేమియు తెలియదు. వాని ముచ్చటతీర్చుటకే నేనేపనిజేసినను.

ప్రవేశము మేధావి

మే:- ఏమిసంగతి ? ఒక్కదాన విక్కడేమి చేయుచున్నావు ?

నీ:- ఊరకె తిట్టకుడు. మీకొకవస్తువునిచ్చెద.

మే:- నాకొకవస్తువునా ? ఎప్పుడును ఉన్నదానినేకదా?

నీ:- దేనిని ?

మే:- బుద్ధి తక్కువభార్యను.

నీ:- ఆ ? అంతేనా ? మీకదేరుమాలు నిచ్చినచో నాకేమిచ్చెదరు ?

మే:- ఏరుమాలు ?

నీ:- ఏరుమాలు! పద్మకు మొదట పాండ్యుడిచ్చినది. అపహరింపుమని మీరు మాటిమాటికి నన్ను వేధించినది.

మే:- కాజేసితివా ఆమెవద్దనుండి.

నీ:- లేదు. లేదు. ఏమరుపాటున ఆమెయే జారవిడిచినది. సమయమునకక్కడుండుట తటస్థించుటచే నాకు దొరకినది. ఇదిగో చూడుడు.

మే:- బలే తప్పుడు దానివి. ఏది ఇటు తే!

నీ:- దానినెట్లయినను హరింపవలెనని అంతగ రంధిపడితిరే, దానితో ఏమిచేయుటకని?

మే:- (దానిని లాగుకొనుచు) ఎందుకు? దేనికైననీకేమి?

నీ:- మీకు దానితో అంత అవసరమగుపని లేనిచో నాకిచ్చివేయుడు. పాపమా ఇల్లాలికిది లేనిచో పిచ్చిపట్టును.

మే:- నీవు తీసినట్లు చెప్పకు. దానితో పనియున్నది. నన్నిక విడిచిపో (నీలపోవును) ఈరుమాలు సత్యకుని గదిలో జారవిడిచి అతనికి దొరకునట్లు చేసెద.

ఆ॥ గడ్డిపోచకంటె కడుపేలవములగు
స్వల్పములును నిత్యశంకితులకు
శ్రుతివచనములట్లు శుద్ధంబులైన సి
ద్ధాంతములుగదోచు తలనుదాల్ప.

ఇది కొంతవఱకు పనిచేయవచ్చు. నాకాటుతో పాండ్యునకప్పుడే కొంత తెలివి తప్పినది. కొంపలుతీయు ఆలోచనలు స్వభావసిద్ధముగ మొదట తెలిసికొనలేని చేదువై శరీరముపై

ఏమాత్రము పనిచేసినను గంధకపు గనులవలె భగ్గుమను కాల కూటములు. చెప్పితిగదా—, అడుగో వచ్చుచున్నాడు.

ప్రవేశము వీరసేనుడు.

ఏనల్లమందును, ఏగంజాయియు, లేక ప్రపంచమునగల మత్తేమత్తు ద్రాగుడుగూడ నిన్నటి నీకమ్మనినిద్ర తెప్పించుటకు చికిత్స చేయలేవురా!

వీర:— హా హా ఎంత మోసము!

మే:— మఱల ఎందుకు ప్రభూ! ఆసంగతినే ఎత్తుకుడు.

వీర:— ఛిపో-ముందువెళ్ళు. నన్ను చిచ్చులోపెట్టితివి. కొంతగ తెసికొనుటకంటె పూర్ణముగ వంచింపబడుట మేలు.

మే:— ఇప్పుడెందుకుప్రభూ!

వీర:— దానిరహస్య కామవికారములు నాకేమి తెలి తెలియును? నేనవి కనలేదు. వినలేదు. నాకవే కీడును చేయ లేదు. మఱురాత్రి హాయిగ నిద్రించి ఆనందించించితి. దాని పెదవులపై సత్యకునిముద్దులు చూడలేకపోయితి. దొంగిలింప బడిన వానికాదొంగతనము తెలియకుండినచో అతడు దొంగి లింపబడినవాడేకాడు.

మే:— ఇట్లు వినివలసివచ్చినందుకు చాల చింతగనున్నది.

వీర:— నాకేమియు తెలియకుండినచో చాలు. కయ్యపు దండులో ఊడ్పుగాండ్రందఱు దాని మధుర గాత్రమును చవి జూచినను గూడ నాకుసమ్మతమే. సంతోషమే. ఓప్రశాంత చిత్తమా! ఎన్నటికిని నాకికరాకు. సంతోషమా! నమస్కా

రము. జయచిహ్నితసైన్యమా! తృష్ణమంచిదనిచెప్పుసమర్థించు మహాయుద్ధములారా! సెలవు. తురగహ్రేషలకును, బాకా మ్రోతలను, ఉద్రేకజనకములగు భేరీరావములకును, చెముడు పఱచు శంఖనినాదములకును, రాజపతాకకును-, ఇంకను అన్నిటి కిని-, ఉన్నతికి, భోగమునకు, ముదావహములగు యుద్ధపరికర ములకు-వందనము, మహేంద్రవజ్ర నిర్ఘోషమువంటి భీషణధ్వని గల ఓమారణయంత్రములారా! మికుస్వస్తి. వీరసేనునిపని దీరినది.

మే:- ఇది తగునా ప్రభూ!

వీర:- పాపీ? నాప్రేయసిని లంజ అని రూపింపవలె. ఆమాటమీాదనే ఉండు. నాకు ప్రత్యక్షనిదర్శనమిమ్ము. లేనిచో రేగిననాకోపమునకు గుఱియగుటకంటె నీవొక కుక్కవై పుట్టి యుండుటమేలు.

మే:- చివరకింతవఱకు వచ్చినదా?

వీర:- నాకంటికి చూపు. లేదా, కనీసము సందేహము నకు సందులేనట్లుగానైనను ఆ అనుమానము ధృవపఱుపు. లేనిచో నీప్రాణములపై తీపిని చేదుగామార్చుకో.

మే:- మహాప్రభూ!

వీర:- దానిపై దూఱువేసి నాకు తంపటపెట్టితివిగనుక ఇక ఏమియు చెప్పకు. నీ అంతరాత్మను చంపుకో. ఘోరము లపై ఘోరముల పేర్చు. నీ అధోగతికి ఇంతకుమించి ఏమియు చేయలేవుగనుక భూమిఅంతయు బెగ్గడిలి స్వర్గమంతయు ఏడ్చు

నట్టి కృత్యములు చేయుము.

మే:- దైవమా ! నన్ను క్షమింపుము. నీవొక మానవు డవా ? నీకొక ఆత్మగాని, బుద్ధిగాని ఉన్నదా ? భగవానుడు మిమ్ము కాపాడుగాక. నా ఉద్యోగము పుచ్చుకొనుడు. నీ విశ్వాసము నొకదోషముగాజేయుటకు బ్రతుకుచుంటిపిరా నిర్భాగ్యపు మూర్ఖా ? ఓ లోకమా ! నిష్కపటముగను, న్యాయముగను ఉండుట ఎప్పటికిని మంచిగాదని తెలిసికో, తెలిసికో. ఈగుణపాఠమున కెంతయు కృతజ్ఞుడను. అతి ప్రేమ ఇట్టి ఆపదలకు మూలము గావున ఇటనుండి ఏ మిత్రుని ప్రేమింపను. (పోబోవును)

వీర:- వద్దు ఆగు. నీవు యథార్థవాదివే కావచ్చు.

మే:- విశ్వాసము తనకై కృషిచేయువారినే త్రోసి వేయు ద్రోహిగావున నేనిక జాకరూకుడనే గావచ్చు.

వీర:- దైవసాక్షిగ నాభార్య నిష్కళంకయే అను కొందును. మఱల కాదనుకొందును. నీవు న్యాయస్థుడవే అను కొందును. మఱల కాదనుకొందును. ఏదైన నాకొక నిదర్శన ముండవలె. పూర్ణ చంద్రకళలవలె స్వచ్ఛములగు నాయింతి నామాక్షరములు నాదృష్టిలో కమలి నామొగమువలె నల్లనై పోయినవి. త్రాళ్ళుగాని, కత్తులు గాని, విషములు గాని, ఉక్కిరి బిక్కిరిచేయు నీరుగాని, నిప్పుగాని లోకమున ఉన్నచో ఇట్టిది సహింపను. నాకు తృప్తి కావలెను.

మే:- ప్రభూ మిమ్మావేశము తినివైచినది. మిమ్ముల

నీస్థితికి తెచ్చినది నేనే అని చింతిలుచున్నాను.. మీారు తృప్తి పడుచో ? !

వీర:- పడుచోగాదు. పడవలె.

మే:- పడవచ్చును. ఎట్లు పడుట ప్రభూ ! వారు ఊర పిచ్చుకలవలె విరామము లేకున్నను మీారే చూడవలయుట అసంభవము. లోకమునలేనిది. అయినను సత్యేద్వారముకడకు సూటిగ తీసికొనిపోవు ప్రబల సాక్ష్యములును, పరిస్థితులును చాలినచో మీా రా తృప్తిని పొందగలరు.

మే:- ఇంకేమి! అదిద్రోహియనుటకు సజీవమగు హేతువును చూపు!

మే:- నా కీ ఉద్యోగము బాగుగలేదు. అయినను ఈనిమిత్తమున బుద్ధిలేని మమకార విశ్వాసములచే పొడువబడి ఇంతవఱకు వచ్చితినిగనుక చెప్పెదను వినుడు. ఒకరోజు చాల ప్రొద్దుపోయి సత్యకునితో పరుంటిని. తీవ్రమగు పంటిపీపుచే తెప్పవాల్చనైతి.

మ॥ కలతంజెందిననిద్రలందు తమజాగ్రద్వృత్తముంగూర్చి దు
ర్బలచిత్తంబున వాగునట్టి తెగవారల్ లేరెపెక్కండ్రు ; రం
దులకుఁ వారల తీవ్రిలౌల్యము సెయొంతుఁ హేతువం; చట్టి వెం
గలఁ౦ దీమనసత్యకాధముడు నొక్కండౌగదే దేవరా.

అతడు నిద్రలో "ఓ నా ప్రియపద్మా ! మనము జాగ్రతగ నుండవలె. మనప్రేమలు నరమానవునకు తెలియగూడదు" అని చెప్పుట వింటిని. అంతతో ఆకగ, నాచేయి తనచేతితో మెలిపి, నలిపి, "ఓ నా బంగారు బొమ్మా!" అని అరచి

నాపెదవిపై ఎదిగిన ముద్దులను కూకటి వ్రేళ్ళతో పెకలించునంతటి గాటముగ నన్ను ముద్దుపెట్టుకొని "పాడుదైవము నిన్ను పాండ్యునకిచ్చెగా" అని నిట్టూర్పు పుచ్చెను.

వీర:- హా రాక్షసము! రాక్షసము.

మే:- కాదు. ఇది అతని స్వప్నమాత్రమే.

వీర:- నిజమే—ఇది కేవల స్వప్నమాత్రమే అయినను అతని పగటివ్యాపారమును స్థిరపఱచుచున్నది. కావున గట్టిగ శంకింప దగియున్నది.

మే:-కావున దుర్బలముగా రూపింపబడు ఇతరనిదర్శనముల బలపఱచుట కిదిసాయపడవచ్చు.

వీర:- దానిని ముక్కలు ముక్కలుగా నఱికెదను.

మే:- వద్దు వద్దు. నిబ్బరముండవలె. పాపపుమాటలే కాని, ఇంతవఱకును చూచినదేమియునులేదు. ఇప్పటికిని ఆమె పతివ్రతయే కావచ్చు. కాని, నాకొకటిచెప్పుడు! సంపెగపూల కుట్టుగల చేరుమాలును మీభార్యచేతిలో ఎప్పుడైన చూచి యుంటిరా?

వీర:- అట్టిదే దానికొకటిచ్చియుంటిని. అదియే దానికి నామొదటికానుక-

మే:- అది నాకేమియు తెలియదు. కాని—అట్టిదే ఒక రుమాలుతో—అది మీభార్యదనియే నానమ్మకము- సత్యుడు నేడు దినము తనమొగము తుడుచుకొనుచుండుట చూచితి.

వీర:- అది అదియే అయినచో?

మే:- అది అదియే అయినను, లేక-, అది ఆమె దేఅగు నింకొకటిదైనను-, ఇతర నిదర్శనములతో పాటు అదికూడ ఆమెకు వ్యతిరేకవాదమునే చేయుచున్నది-

వీర:- ఆత్మోత్తకునకి ఒక లక్ష ప్రాణము లుండ వల్యేనే! ఒక్కటియేఅగుచో చాల దుర్బలమై నాకసికిబోత్తుగ చాలదు. ఇప్పటికిది యధార్థమనియే తోచుచున్నది. చూచి తివా మేధావీ! నాప్రియప్రేమ సంతయు శూన్యమగు నాకసము వంక కూదుచుంటిని. అది అంతయు పోయినది. తీవ్రప్రతీ కారమా! నీబోలు అరలోనుండి లెమ్ము. అనురాగమా! నీహృదముపీఠమును, కిరీటమును నిరంకుశమగు పగకు, అర్పిం పుము. హృదయసర్పమా! బుస్సుమని భయంకరముగ లేచి కఱ చుటకు దూకుము.

మే:- కొంచెము నిదానింపుడు.

వీర:- హా రక్తము. రక్తము. రక్తము.

మే:- నిదానమని చెప్పుచున్నాను. ఒకప్పుడు మీబుద్ధి మాఅవచ్చు.

వీర:- ఈజన్మమునలేదు మేధావీ! ఈ విషయచర్వణచే నామనఃకల్లోలములనుండి వెడలిన ఈ హాలహాలము నిర్దయాత్మ కమై తనబారినపడిన పాపపుజీవుల నెల్లరను దహించువఱకును పరుగ్రమునకునులొంగదు. (మోకరిలబడును)

అ॥ అల్ల కానిపించు నబ్ధిసాక్షిగ,పవి
త్రప్రమాణమందు తగిన గౌర

వమున, దాచిదాచి బల్కుచుంటిని; నాకె
దేవుడున్న యోచన విడుగనింక.

మే:- అప్పుడే లేవకుము. (మోకరిలబడును)

ఉ॥ నింగినిజుక్కలార! రజనీపతిభాస్కరులార! మూక చు
ట్టుంగల భూతసంఘము! యిటుల్ పరిభావము పొందినట్టి పాం
డ్యుంగొలువంగ గాళ్ళు కరయుగ్మము బుద్ధియు నింతయేల స
ర్వాంగము ధారపోసితి యథార్థపు సాక్షులు మీరె చూడుడీ.

అతని నాజ్ఞాపింపనిండు. ఎట్టి క్రూరకర్మమైననసరే నెరవేర్చుట మాత్రమే నావిధి- (వారు లేతురు)

వీర:- నీప్రేమను శపథక్రియములతోగాదు అభినందించుట—, నీభక్తి విశ్వాసములు చూపగల ఆమహాత్కార్యమును నీకప్పగించి.— ఇక మూడు దినములలో సత్యకుడు లేడని నీవుచెప్పగా నేను వినవలె.

మే:- నామిత్రుడువచ్చినాడు. అది తమ ఆజ్ఞపై అయినదే అనుకొనుడు. కాని ఆమెనుమాత్రము బ్రతుకనిండు.

వీర:- నాశముచేయవలె. కుక్కముట్టినకుండ—, నాశము చేసి తీరవలె. అవలకు పోదమురా! ఆసుందరపిశాచికి ఎంత త్వరలో ఏరకపు చావు కల్పింపవలెనో యోచింతము! ఇపుడు నీవే నాదండపతివి.

మే:- నేనెప్పటికినిమీవాడనే. (నిష్క్రమింతురు)

రంగము 4. కోటముంగిలి.

ప్రవేశము పద్మాదేవి, నీలాంబరి, విదూషకుడు.

ప:- ఓరీ సత్యకునిబస నీకు తెలియునురా ?

వి:- తెలియదు దేవి! ఇక్కడనో అక్కడనో అని ఊహించిచెప్పుట, నాగొంతులో అబద్ధమాడుకొనుటే.

ప:- ఇతరులనడిగి తెలిసికొలేవా?

వి:- అతనికొఱకు మేడమీద తలలన్నిటిని ఊచి మీకీయవలసినది సంపాదింతును.

ప:- అతనికొఱకు వెదకు. సేనానిని తనకొఱకు కదల్చిచూచితిననియు అంతయుఅనుకూలముగనే ఉండుననియు కూడచెప్పి ఇచటికి రమ్మను.

వి:- అతనిని త్వరలోపంపుటకు మహాకృషించెదను.
(పోవును)

ప:- నారుమాలు ఎచటపోయియుండును నీలా?

నీ:- నాకు తెలియదు దేవి!

ప:- నావరాలమూట పోయినను అంతగా అనుకొన నన్నచో నమ్ము.

తే|| ఇది దురూహాలకుం జాలినదియొయైన।
నూరక్కే శంకలోముస్గ వారిరీతి
తమకు టెఱుంగని యా నాయుదారమూర్తి
యంతమాత్రకె రేకియూహలకుబోడు.

నీ:- అనుమానపడలేదా అతడు.

ప:- ఎతడు? అతడా? అతడుపుట్టినచోటి సూర్యుడు వానిలోని అట్టిమలినములను పీల్చివైచినాడు.

నీ:- అడుగో వచ్చుచున్నాడు.

ప:- సత్యకుని పిలిపించువఱకు నాపట్టు వదలను.

## తృతీయాంకము.

### ప్రవేశము వీరసేనుడు

మీకెట్లున్నది ప్రియా?

వీర:- బాగుగనేడున్నది పద్మా. (స్వగతము) ఆహా నటించుటెంతకష్టము! (ప్రకాశము) కుశలమా సఖీ-

ప:- కుశలమే ప్రభూ!

వీర:- ఏదీ నీచేతినిమ్ము. ఈచేయి చల్లగనున్నది సఖీ!

ప:- అదింతవఱకు ఏకష్టమును ఎఱుగదు.

వీర:- ఇది ఇట్లుండుట నీధారాళ దాతృత్వమును ప్రకటించుచున్నది. ఎప్పటికప్పుడు రేగుచుండు లేబ్రాయపు పిశాచి ఒకటి ఇచట నుండుటచే, దానికి స్వేచ్ఛనుండి ఏకాంతమును, ఉపవాసముతోడి ఉపాసనయు, అధికప్రాయశ్చిత్తమును భక్తి పరతంత్రయు,గావలెనని ఈ ఈచేయి సూచించుచున్నది. ఎట్లయినను ఇది మర్మములేని ధర్మహస్తము.

ప:- నా హృదయము నిచ్చినచేయి ఇదియే గనుక మీరట్లు చెప్పవచ్చు.

వీర:- నిజమునకు ధారాళమగు హస్తము. పూర్వపు పాణిగ్రహణములలో చేతుల నిచ్చునవి హృదయములు. కాని ఇప్పటి మన నూతన దూతలు చేతులేకాని మనసులుకావు.

ప:- నాకేమియు తెలియుటలేదు. ఏదీ మీవాగ్దానము.

వీర:- ఏవాగ్దానమే రాణీ?

ప:- మీతోవచ్చి మాటాడుమని సత్యకునకు కబురు చేసితిని.

వీర:- తల దిమ్ముగాచే కంటివెంట నీరుకారుచున్నది. ఏది సిరుమాలు ?

ప:- ఇదిగో ప్రభూ !

వీర:- నీకునేనిచ్చినది?

ప:- నావద్ద లేదే !

వీర:- లేదా ?

ప:- లేదు ప్రియా !

వీర:- అది మహాదోషము. జనుల మనోగతములను చక్కగా ఎఱుగఁగల ఒక మహాసిద్ధుడు దానిని మాతల్లికిచ్చినాడు. అతడు గొప్పమాంత్రికుడు.

ఉ॥ ఈ చవుకమ్ము జాగ్రతమెయింబదిలింపుము : నీమగండు నీ
గీచినగీటు దాటఁడు; సుఖించెద; వేరికినిచ్చితేని, పా
ద్రోచితివేని నాథుఁడు విరోధియగుం; నిను సేవగించు; న
న్యాచరణమ్ము గోరునని యాతఁడు చెప్పెసుదంబతో సఖీ.

నాతల్లి చనిపోవుచు నాకీకథచెప్పి దైవము నాకర్ధాంగినిచ్చునాడు ఆతరుణికిమ్మని యాజ్ఞాపించినది. నేనును అట్లే చేసితిని. దానిని భద్రముగచూడు. నీఅమూల్య నేత్రమువంటి ప్రియమైనదిగా ఎంచు. దానిని పోగొట్టుకొనుటగాని ఇచ్చివేయుటగాని అంతటిది ఏదియుగాని మహాపరాధము.

ప:- అట్టిదా అది ?

వీర:- నిశ్చయముగ అట్టిదే. దానికుట్టులో మహత్తున్నది.

## తృతీయాంకము.

క॥ సన్మానుసంక్రమణములం
కన్నులజూచిన ఋషి ప్రకాండము డావే
కోన్నతిలో నద్దెను; దా
కొన్ని మహామంత్రము లనుకొనుచుల తాంగీ.

అప్పుడను పుట్టించిన పురుగులుగూడ మహాపవిత్రములు. ఆ కుమారులనుఆసీర్వదు అనుకూల దాంపత్యముగల మహా పతివ్రతలచే తాకించి ఆశీర్వదింపచేసినాడు.

ప:- నిజముగా ?

వీర:- ముమ్మాటికినిజముగ, కావుట్టి నాసక్తి బాగుగ పెరిగెను.

ప:- అట్లగుచో దైవము నాకేమి చూపకయేయుండిన బాగుండెడిది !

వీర:- ఎందుకని ?

ప:- ఎందుకు అంత తీవ్రముగ కొట్టవచ్చినట్టుగా నున్నావు ?

వీర:- పోగొట్టితివా ? అదేపోయినదా ? చెప్పు, తప్పిపోయినదా ?

ప:- మనల దైవము రక్షించుగాక.

వీర:- చెప్పు.

ప:- పోలేదు. కాని ఒకవేళ పోయినచో ?

వీర:- ఎట్లుపోవుట ?

ప:- పోయినదని చెప్పుటలేదు.

వీర:- అయితే తీసికొనిరా. నేను జూడవలె.

మెక్కి యుదరముల్ నిండినమీద గక్కి
వైచెదరు; వారిదగు దుస్స్వభావమిదియే.

అరుగో సత్యకుడును నానాధుడును.

ప్రవేశము మేధావి సత్యకులు

మే:- ఇంకొకమార్గమేలేదు. ఇది చేయువలసినదా మెయే. ఓ నూడు! ఏమినిఅదృష్టము. వెతుకబోయిన తీగ కాలికే తగిలినది. పోయి ఆమెనే పట్టుబట్టు.

ప:- ఏమి సత్యకవర్య విశేషములు?

స:- ఏమున్నది తల్లీ! ఇదివఱకు మనవిచేసికొన్న దే. సమర్థులగు మీమూలమునే మఱల(బతికి నాహృదయపూర్వక భక్తిప్రేమలతో నేను ముమ్మాటికి గౌరవించువాని కటాక్ష ప్రపంచమున ఒకసలుసునై ఉండవలెననియే మిమ్ములను కోరుట. ఈజాగునోర్వజాలను.

ఉ॥ ఇప్పటిచింత గాని, మును పెనొనరించిన సేవగాని, ముం
దెప్పటికిన్ వినిశ్చితమదీరిత వర్తనగాని, యా ప్రభుం
డొప్పెడునట్లుగాసలుప నొల్లనియంతటిచెప్పరాని దా
తప్పనితోచినన్ తగువిధంబున తెల్పిన నింకవత్తునే!

అట్లగుచో బలవంతపు సంతృప్తిలో తొడుగబడి అదృష్టదేవతా దయాధీనమగు నితరమార్గాన్వేషణమున నైనను పడిఉందును.

ప:- ముమ్మాటికి నెమ్మదిగల సత్యక! ఏమనిచెప్పుదు? నా వాదమునకు అనురాగముగాక విరాగము పుట్టుచున్నది.

ఉ॥ ఆకృతితోడ మానసమునందునగూడ సఖా! మనోహరుం
డేకడ నెట్టులే కతన నీగతిమారెనో, యిట్టులుంను కెం

షక్రము లనిపించుహానియొప శైతము మందుమరీగృహస్థ ధ
ర్మమున మెలంగు పూరుషులం: క్రమస్మరశాంతిని గాంతురప్పుడే.

అదిసహజమే. గోరుచుట్టుమేచినదనుకొనుము. ఆ వ్రేలు ఆరోగ్య వంతములగు ఇతర భాగములకుగూడ తనభాధాజ్ఞానమునిచ్చును. పురుషులు దేవతలని మన మనుకొనగూడదు. లేక వారిలో పెండ్లినాటి మృదులక్షణములే ఉండుననికూడ మన మూశింప రాదు. నాది, "తగనికౌర్యము" గనుక సీతా! ఈ నిర్దయకు గాను అతనిపై తప్పమోపి నా అంతరాత్మ ఎదుట, వాని నిల బెట్టుచున్నందుకు నన్ను గోదికివచ్చినట్లుతిట్టు. కాని సాక్షులగు నా భావములకు లంచమిచ్చితిననియు అతడు అన్యాయముగ మోపబడెననియు ఇప్పుడు గ్రహించితి.

నీః- నిన్నుగుఱించి ఏ పిచ్చిఅనుమానములుగాని వీఇతరాభిప్రాయములుగాని గాక నీవనుకొనినట్లు రాజకీయముత్రే అయి ఉండవలెనని దైవమునకు నా ప్రార్థన.

పః- ఎంతదుర్దినము ! అతనికెప్పుడును అట్టి తావిచ్చి యుండలేదే.

నీః- కాని శంకాగ్రస్తులకు విచక్షణలతో పనిలేదు, వారెప్పుడును హేతువుండియే శంకింపరు. శంకింతురుగనుక శంకింతురు. అనుమానమనునది దానికై అదేపుట్టి అదే పెరుగు రాకాసి.

పః- దైవమట్టిరాకాసిని నాప్రియుని బుద్ధినుండి దూరము చేయుగాక.

నీ:- తథాస్తు దేవీ!

ప:- నేనుపోయి నావిభుకెక్కడనుండునో చూచెద. నీవు, ఈ చాయలనేయుండుము సత్యకా! అతడు సరసముస ఉన్నట్లు తోచినపక్షమున మరల నీసంగతి ఎత్తి, నాశక్తినిమించి అను కూలమగునట్లు చూచెద.

స:- పీడు తమకెంతయు కృతజ్ఞుడు. (నీలాపద్మలు పోదురు)

పత్రివేళము నాగమణి

నా:- సుఖమా సత్యక!

స:- నిన్నింటినుండి రప్పించినదేది? కుశలమా మణీ! నిశ్చయముగ మణీ! నీయింటికే వచ్చుచుంటిని.

నా:- మణీనేను నీకొరకే పోవుచుంటిని! ఏమి నాకగు పడి వారముగోజులా? ఏడుపగళ్ళు ఏడురాత్రులా? ఏడు ఇరు పది నాల్గుగంటలా? కాముకుల విరహావేళలు కాలచక్రము చూపుదానికిముబ్బడిగ జాగైనట్లుతోచును. ఎంతవిసగటలెక్క!

స:- క్షమించుమణీ! నామనసిప్పుడు భారములగు భావ ములచే అణగియున్నది. కాని కొలదిలోనే నావిరామాధిక్యతచే ఈవార తీర్చెదనులే. (పద్మ రుమాలు నిచ్చును.) మణీ! ఈరకముదిఒకటి అల్లిపెట్టవలె.

నా:- ఎక్కడనుండి వచ్చినదిదిసత్యక! ఇది క్రొత్త చెలి కారపు లాంఛనము. నీరాకుండుటకు కారణమిపుడు తెలిసినది. చివటికెంతకు దిగినదిగా? సరే సరే.

# వీరసేనుడు

## [చతుర్థాంకము]

### ఒకటవ రంగము

కొలువుముంగిలి. ప్రవేశము మేధావి వీరసేనులు.

మే:- తమరట్లు తలతురా ?

వీర:- అట్లే తలతును మేధావీ !

మే:- ఏమిటి ఏకాంత సంభాషణమా ?

వీర:- అవును. "పరోక్షే దారభాషణం" —. మంచిగనే ఉద్దేశింపుచుగూడ అట్లు చేయువారి మంచిని కాముడు త్రోసి వేయును. వారు దైవమును త్రోసివేయుదురు.

మే:- కావున వారు చేసిన దేమియులేదు. అది ఒక క్షంతవ్యమగు పొరపాటు. కాని నేనొక రుమాలును నాభార్య కిచ్చినచో ?

వీర:- ఇచ్చినచో ?

మే:- ఇంకేమి? అది తనదే. తన దైనపుడు ఎవరికైనను ఈయవచ్చుగా ప్రభూ !

వీర:- ఆమె తన గౌరవమునుగూడ కాపాడుకోవలె. అది మఱొకని కీయదగునా ?

మే:- ఆ|| గౌరవంబునంగ కంటికింగన్పింప
నట్టి సారమందు రధికమతులు
తలచులేనివారి దగ్గర నేయది
యున్న యట్లుతోచు మందు దేవ!

కాని ఆ రుమాలు విషయములో.

వీర:- నా రుమాలు అతనివద్దనున్న చంటెవి. అది మహా మారిగల కొంపపై నెత్తుబట్టు విడచిరానున్న కీడునుసూచించు తీతువ పిట్టవలె నాస్ఫురణకు వచ్చుచున్నది.

మే:- అదొకలెక్కేమి?

వీర:- అంతకుమించిగూడ ఉన్నవా?

మే:- లోకములో ఒక రకపు స్త్రీలను తాము పీడించి వెంటాడుటచే ఒప్పించిగాని, లేక తనకై తానె ఎవతెలయినను ముచ్చటపడుటచే అట్టిదానిని మెప్పించిగాని, తమ అంకుల గూర్చి డాబులుగొట్టుట ఘనమనుకొను ఇట్టితుచ్ఛులు వేనకు వేలుందురుగనుక-, అతడట్లు చెప్పుచుండగా వింటినని యో, లేక ద్రోహముచేయుచుండగా చూచితినని యో, చెప్పినచో?

వీర:- ఏమైనా చెప్పెనా అతడు?

మే:- చెప్పినాడు ప్రభూ? కాని ఘోరప్రమాణములచే లేదనివాదించుననిమాత్రము ముమ్మాటికి నమ్ముడు.

వీర:- అతడేమి చెప్పెను?

మే:- యథార్థముగ అతడు చేసినది-నాకు తెలియనిది.

వీర:- ఏమి రుమాలు! ఒప్పుకొనుట! రుమాలు! ఒప్పుకొని రాజదండము? లేక యమదండము? ప్రకృతి ఏమియులేక

ఇట్టి ఆవేశమును పొందదు. నన్నిట్లు చేయునవి మాటలు గావు-ఛీ-ముక్కులు-చెవులు-నోళ్ళు. ఇది నిజమా ? ఒప్పుదల? రుమాలు ! ఒప్పుదల. ఓ పెనుభూతమా ! (మూర్ఛిల్లును.)

మే:- బలే. నామాత్ర బాగుగ పనిచేసినది.

తే|| ఊరకే నమ్మి మాకు లిట్లురులలోన
బడుదు: లేమిరామెలింగని పరగుకాఢ్య
లైన యిల్లాండ్రు నిందపాలగుదురకట
కారణము లేకె దుష్టులకతనపురుషులు.

ప్రభూ ప్రభూ లెండు. హా ప్రభూ !

ప్రవేశము సత్యకుడు.

ఏమి సత్యక ?

స:- ఏమిది ?

మే:- మన ప్రభుడు మూర్ఛమునిగి యున్నాడు. వీనికిది రెండవసారి. నిన్న ఒకటి వచ్చినది.

స:- ఆకణతలను గట్టిగరుద్దుము.

మే:- ఆ ? వద్దువద్దు ఆగు. ఆమంపు తనంతట అదే శాంతింపవలె. లేనిచో నురుగులుగక్కి పెద్దపెట్టున పిచ్చికిదిగి క్రూరములకు తలపడును. చూడు కదలుచున్నాడు! కొంచెము సేపు,ఆవలకుపో. తిన్నగా అతడు తెలివికివచ్చును. అతడుపోగనే నీతో అవసరమగు విషయమొకటి చర్చింపవలెనని యున్నది. (సత్యకుడు పోవును) ఎట్లున్నది సేనానీ ? మీతలకేమియు తగుల లేదుగద ?

ఖీర:- తలకా తగిలినది ? ఏమీ హేళన ?

మే:- మీమ్ములను హేళన ? లేదు. దైవసాక్షిగ లేదు. మీారు మీా భవిష్యత్తును పురుషులై భరింపవలెనని యున్నది.

వీర:- ఇంకులాడి మగవాక పురుషుడుగాడు సరిగదా, రాకాసియేగాక మృగముగూడ అగుచున్నాడు.

మే:- అట్లగుచో జనవికీర్ణమగు పట్టణమున మృగములును నాగరకపురాకాసులును అనేకములు గలవు.

వీర:- అతడది ఒప్పుకొనెనా ?

మే:- దేవర పురుషులై యుండవలె. ఒకసేను అంటగట్టినచో జాలు మీ వసమువచ్చిన ప్రతిపురుషుడును మీా లెక్కలోనివాడే.

మ॥ అకళంకమ్ము లటంచు, డంబము లసంఖ్యాకమ్ముగా గొట్టి, ని
త్యకళంకాంకిత శయ్యలందె, సుఖనిద్రం బొందుచుం, శంక యిం
చుకయుం గాంచనివారి నెంచునెడ మించుం లోకులం గూడ; భ
ర్తకు, లోకస్థులకన్న మున్ను నిజభార్యా దోషముల్ దోచునే ?

ఇంకను మీా స్థితియే కొంచెము నయము. నిశ్చింతమగు శయ్యలో జారిణిని ముద్దాడుచు నిర్దుష్టయని మురియుట ఎంతటిప్రారబ్ధము! ఎంతచులకన ! కాని, ముందునాగతి చూచుకొనవలె. పిమ్మట దానిగతి విచారించెదను.

వీర:- నిశ్చయము. నీకెంత దూరాలోచన ?

మే:- అక్కఱలేదు. కొంచెముసేపావలఉండుము. సహనమునకుమాత్రము కట్టుబడియుండవలె. మీారిపుడు దుర్భర చింతలో మునిగిపడినపుడు-ఉద్రేకమట్టివానికి బొత్తుగ ఆగదు-

సత్యకుడిచటికి వచ్చెను. మీ ఆజ్ఞను ఒకమంచివంకజెప్పి అతని నావలకుబంపితిని. త్వరలోవచ్చి మాటాడిపొమ్మనిగూడ హెచ్చరించితిని. తప్పక వత్తునని పోయెను. మీరాచాటున గొంచెమునక్కియుండి వానిముఖమున తాండవించు పరియాచకములు, అసూయలు గమనింపుడు. మఱల కథక్రొత్త చేసి, ఎక్కడ, ఎట్లు, ఎన్నిసార్లు, ఎప్పటినుండి, అనజెప్పుడో కుదిరిక, మఱల ఎప్పుడో మీభార్యను కలిసికొనుట-, అంతయు చెప్పించెద. ఊరకె అతనివైఖరి గమనింపుడు. చాలును. కాని దురుసు పనికిరాదుసుమా! లేనిచో మీకు నిలువెల్ల క్రోధమే గాని మానవత్వమేమాత్రమును లేదని చెప్పవలసివచ్చును.

వీర:- వినుచుంటివా మేధావి! నా ఓర్పులో కడునేర్పరి ననిపించుకొందును. కాని వినుచుంటివా మహాఘోరము?

మే:- నిజమే. కాని జాగ్రతసుమా!- దేనికైనను సమయము కనిపెట్టవలె. డాగుకొందురా? (వీరసేనుడు డాగును) నేనిపుడు నాగమణి విషయముగా సత్యకుని ప్రశ్నించెద.

ఉ॥ అంగజభావమన్‌చిలిపి యాంగడిలో దనసిగ్గుబెట్టి ద
బ్బంగడియించునట్టి పడపుంజెలి యేలనో వినితోడి దు
స్సంగతి తానెగోరి పడిచచ్చును. లోకములోన పల్వురన్
లొంగగ దీసి యొక్కనికిలొంగుట లంజలకున్నరోగమే.

అతడు దానిసంగతి ఎత్తగనే పొట్ట ఉబ్బవచ్చునవ్వును ఆపుకొన లేడు. అదుగో వచ్చుచున్నాడు. వీడు నవ్వినకొలది వీరసేనునకు పిచ్చిఎక్కవలె. పాపము సత్యకునిచిఱునవ్వులు, బోళాతనములు

అన్నియు, ఇతని జ్ఞానశూన్యమగు అనుమానమునకు అపార్థము లుగా తోచవలె. ప్రవేశము సత్యకుడు

కుశలమా దండపతీ ?

స:- ఏదిలేకపోవుట నన్ను చంపనుగూడచంపుచున్నదో అట్టిబిరుదము నాకిచ్చుట చచ్చినపామును చంపుటే.

మే:- పద్మను పట్టు పట్టు. ఇక అది గట్టినమ్మకమే (సన్నగ) ఇప్పుడిది నీమణిచేతనే ఉన్నచో నీపని ఎంత సులువై యుండెడిది.

స:- పాపము వట్టి దిక్కుమాలినది.

వీర:- (స్వ) వీనికప్పుడే నవ్వారంభించినది.

మే:- కాని మగవానిపై ఇంతతీపిగల ఆడుదాని నింత వఱకెఱుగ.

స:- వట్టిపిచ్చిపక్షి. కాని నిశ్చయముగ నాపై మనసు పెట్టుకున్నది.

వీర:- (స్వ)మొదట మెల్లగాకాదని ఇప్పుడు నవ్వుక్రింద తేల్చుచున్నాడు.

మే:- వినుచుంటివా సత్యక !

వీర:- (స్వ) ఇప్పుడాసంగతి విశదముగ చెప్పుమని అడుగుచున్నాడు. కానిమ్ము మంచిది, మంచిది.

మే:- నీవు దానిని తప్పక చేసికొందువని చెప్పు చున్నదే ! నీకేమయినా యున్నదా ?

స:- హా హ్హా హ్హా హ్హా .

వీర:- నీవే గెలుతువురా లుచ్ఛా! నీవే గెలుతువురా;

స:- నేనా? ఆవాడవదినెను? నా ప్రపంచ జ్ఞానముపై కొంతదయజూపు. అంత శూన్యమైనదిగ ఎంచకు.. హాహ్హాహ్హాహా.

వీర:- (స్వ) అది అది అది అవును. గెలిచిన వారు నవ్వెదురు.

మే:- నిజముగా నీవు దానిని తీసికొని పోదువనియే అంతటను పుకారు.

స:- ఏమి టేమిటి? నిజము చెప్పు!

మే:- కానిచో నన్నొక దుష్టునిగా గట్టుము.

వీర:- (స్వ) నాకొక మచ్చువేసితివిరా? సరే-

స:- ఇది ఆడబ్బాయొక్క సొంతవాయింపు. తన ప్రేమ కొలదియు ఆత్మస్తుతికొలదియు తనకై తాను చెప్పుకొనుచున్నదే గాని ఇందు నేజేసిన వాగ్దానమేమియులేదు.

వీర:- (స్వ) అదిగో-మేధావి సైగచేయుచున్నాడు, ఇప్పుడే కథారంభమైనది.

స:- అది యింతకుముందు ఇచటనే ఉన్నది. కనుపడు నపుడెల్ల వెంటబడును. నిన్న సముద్రపుటొడ్డున కటకపు పౌరులతో మాటాడుచుండగా ఈ ఎడ్డెది-ఎంత ఒట్టైనను సరే-అచటికివచ్చినది.

వీర:- (స్వ) ఓప్రియసత్యక! అని పిలిచినట్లుగాబోలు. చూడగా వాని అభినయము, అట్లు, అర్థ మిచ్చుచున్నది.

స:- ఆవిధముగావచ్చి విదల్చినను పోకమీదు చుక్కలి గోలచేయును. నన్నీతీరున గొల్లిజేయుచున్నది. హాహాహా.

వీర:- (స్వ) నాగదిలోనికి తననెట్లులాగెనో చెప్పక చున్నాడు. నాకు నీకండలేగాని వానిని తినదగిన కాకులు కనపించుటలేదురా !

స:- కాని దీనిపోత్త్రవదల్చుకోవలె.

మే:- నా ఎదుటచూడు ! ఇటే వచ్చుచున్నది !

స:- ఇది ఒకపిూాతపిల్లి. పరిమళములో మాత్రము పునుగు పిల్లియే.

పరివేశము: నాగమణి

ఈ వెంటబడుటలో ఏమి నీయుద్దేశము ?

నా:- అయితే నాకిచ్చితివే రుమాలు, దానిలో ఏమి నీయుద్దేశ్యము ? దానిని తీసికొనుటలో బలే తెలివితక్కువదాన నయితిని. నేనట్టిది కట్టిపెట్టవలె ? ఇది నీగదిలోదొరుకుట— ఎచటినుండి వచ్చినది తెలియకుండుట? బలే నమ్మదగినకథ. ఏగయ్యాళి బహుమానితివో ఇది ! అట్టిదానికుకట్టిపెట్టవలె? అది నీముద్దుల గజ్జెలగుఱ్ఱమునకిచ్చుకో—నీ కదెక్కడనుండి వచ్చినను సరే—, నేనుమాత్రము అది వ్రేలువేసిముట్టను.

సత్య:- ఎందు కెందుకు మణీ ! ఎందు కెందుకు ?

వీర:- (స్వ) దైవసాక్షిగ నారుమాలుఅదియే.

నా:- ఈరాత్రికి భోజనమునకు రాతలచినచో రావచ్చు. లేనిచో నీకు తీరుబడియైనపుడే వత్తువుగాని. (పోవును)

మే:- పోపో-దానివెంటనేపో.

సత్యః_ నిశ్చయముగ పోయితీరవలె. లేనిచో నా కూడు గుడ్డలకు గట్టును.

మే:- ఈరాత్రి భోజనమక్కడా ?

స:- అచటనే అనియున్నది.

మే:- మంచిది. బహుశః నిన్నుమఱలకలిసికొందును. నీతో ఇంకను మాటాడవలసి ఉన్నది.

సత్యః- తప్పకరా ! వత్తువా ?

మే:- సరేపో-ఇకచెప్పకు (సత్యకుడుఃపోవును)

వీర:- (ముందుకుసాగుచు) వీనినెట్లు మారణముచేయుట మేధావీ ?

మే:- తనదుండగములపై వాడెట్లు పగలబడెనో గమనించితిరా ?

వీర:- ఓ మేధావీ !

మే:- అదిగాక మీరా రుమాలు చూచితిరా ?

వీర:- నాదేనా అది ?

మే:- మీదే. మీపాదసాక్షిగా. ఆరుచులమారి మీ భార్యను వాడెట్లుప్రేలెనో చూచితిరా ? ఆమెవీనికిచ్చినది. వీడు తనముండకిచ్చినాడు.

వీర:- తొమ్మిదేండ్లపాటు వానిని చిత్రవధచేయుచునే ఉండవలెననియున్నది. కానిసౌందర్యరాశి. ఎలప్రాయపుకోమలి. మధురముల దీవి !

మే:- కాదు. మీరది మఱచిపోవలె.

వీర:- అవును ఈరాత్రికది చచ్చి కుళ్ళి అధోగతిపాలు కావలె. అది ఇక బ్రతుకరాదు. నాహృదయము పాషాణమై తట్టినపుడు గట్టిగ తగిలిచేయినొప్పిపట్టుచున్నది. కాని

మ॥ ఒకసామ్రాజ్యవిధాయి ప్రక్కన సుఖంబొప్పార బన్నుండి వా
నికి కర్తవ్యములన్ విధింపదగురాజ్ఞిన్ బ్రహ్మదేవుండు తీ
ల్లకుడా నాకొనరింపనేటికి ? జగాలన్ దానికిన్ రామణీ
యకమందెచ్చినజీవి యెయ్యెడలఁ గట్టాలేదు గాలించినన్

మే:- కాదు-ఇదికాదు మీత్రోవ.

వీర:- ఉరితీయుదును. కాని నాభార్యఅననెట్టిదో ఊరకే చెప్పుచున్నాను. దాని సూదివని కదునున్నితము. ఆహా!-

క॥ సహజక్రౌర్యము వ్యాఘ్రము,
సహితము మఱచెడిగతిన్ రసంబుగ పాడున్
సహనం బధికప్రజ్ఞా
సహితపు గల్పనయుమెండు సహచారిణికిన్.

మే:- అంతఉన్నందుకే ఇంతనికృష్ట.

వీర:- ఓ! వేనకువేలుసారులు, అయినను ఎంతవినయము!

మే:- అబ్బో! "అతివినయం ధూర్తలక్షణం" ప్రభూ!

వీర:- నిశ్చయము. కాని ఎంత అన్యాయము మేధావీ! ఓ మేధావీ! ఎంత అన్యాయము.

మే:- ఆమెదుర్మార్గము మీకిష్టమై అంత అమోఘ్య పాపమే అనిపించుచో, దుండగములకు ఒకేసారిగుత్తగా ఆమెకు అనుజ్ఞనిండు. మీకే లేని దితరులకా?

ఆ॥ భార్యననుభవించువాని సహించుచ్చో,
గలుగు చెలిమిమించు చెలిమియును, స
హింప నోపకున్న, నిలనంతకెక్కుడు,
వైరమును, గనంగ లేరు నరులు.

వీర:- ముక్కలుముక్కలుగా నఱికెదను. నన్ను అంకుటాలిమగడనిపించుటా ?

మే:- ఔను. అదే ఆమెలోనిమచ్చ.

వీర:- అందులో నాక్రింది ఉద్యోగితో!

మే:- అది మఱింతబ్రోత. లోకమున ఉచ్చములో నీచముకంటె నీచములో ఉచ్చమే మేలు.

వీర:- నాకేదయినను విషము తెచ్చిపెట్టుము మేధావీ! ఈరాత్రికే; దానిశరీరము, దానిసొంపు, నామనోదార్ఢ్యము సళ్లించునేమోకాని, దానితో వివాదముపెట్టుకోను. ఈరాత్రికే మేధావీ !—

మే:- మీరాపనిని విషముతో చేయవద్దు. ఏ స్వేచ్ఛమగు శయ్యను, కళంకపఱచి భ్రష్టమనిపించినదో, ఆశయ్యయందే గొంతునులిమి కిక్కురుమనకుండ కాజేయుము.

వీర:- బలే. బలే. అట్లగుచో చక్కని న్యాయము జరిగినట్లు. బలే బాగున్నది,-

మే:- ఇక సత్యకునిపనినాది. అర్ధరాత్రియగునరికి మీరనేకములు విందురు.

వీర:- దివ్యముగానున్నది. బలే (లోపలఢంకా) ఏమీఢంకా ?

మే:- రాజధానినుండి ఏదోవచ్చినది. ప్రభునియొద్దనుండి విజయమూర్తి వచ్చినాడు. చూడుడు మీాదేవిగూడ వానితో నున్నది !

ప్రవేశము: విజయమూర్తి, పద్మాదేవి, పరిచారకులు.

విజ:- అమూల్య సేనానీ ! నీకుస్వస్తి.

వీర:- నమస్తే ఆర్య.

విజ:- (ఉత్తరమిచ్చుచు) ప్రభుడును సభ్యులును నిన్న భినందించు చున్నారు.

వీర:- అట్టి ఈసాధనమును శిరసావహింతును. (విప్పి, చదువును)

ప:- విజయబాబు కొర్త్తలేమి ?

మే:- మిమ్ముదర్శించుట కెంతయు సంతసమగుచున్నది. ఆర్య ! మీాకిచట స్వాగతము.

విజ:- మిక్కిలి కృతజ్ఞుడను. దండపతి సత్యకునకు కుశలమా ?

మే:- ఉన్నాడు.

పద్మ:- అతనికిని నానాధునకును నడుమ ఒక చిన్నకలత వచ్చిపడినది. మీారు సరిచేయవలె.

వీర:- గట్టిగ తెలియునా అది ?

పద్మ:- ప్రభూ !-

వీర:- (చదువును) "ఇది నేరవేర్చుట కశ్రద్ధచేయవని నమ్ముచు"

విజ:- నిన్నతడుపిలువలేదు. ఆజాబుపనిమీఁదనున్నాడు. సేనానికిని సత్యకునకును మధ్య భేదమువచ్చినదా ?

పద్మ:- చాల విచారకరమగునది. సత్యకునిపై నాకు గల జాలికొలఁది వీరిద్దఱ నొకటిచేయుటకు ఎంతయుకృషిచేసెద.

వీర:- నిప్పును గంధకమును-

పద్మ:- ఏమందురు ?

వీర:- బుద్ధియున్నదా నీకు ?

పద్మ:- కోపముగనుండిరా ఏమి ?

విజ:- తనపాలనమును సత్యకునకు అప్పగించి ఇంటికి రమ్మని ఆజ్ఞాపించిరి గనుక ఆ జాబతనికి ఆందోళనమును కలిగించి యుండవచ్చు.

ప:- నిజము చెప్పుచున్నాను. నాకు కడు ప్రమోదముగనున్నది.

వీర:- నిజముగా ?—

పద్మ:- ఏమందురు ?

వీర:- నీ ప్రమోదమునకు నాకు, ఉన్మాదముగనున్నది.

పద్మ:- ఎందుకని ప్రియా ?

వీర:- (కొట్టుచు) దయ్యమా-

ప:- నేనిందుకు తగను.

విజ:- నాకనులతో చూచితినని ప్రమాణము చెప్పినను కటకములో దీనినెవ్వరును నమ్మరు. మహాదారుణము. ఓదార్పుము. ఏడ్చుచున్నది.

వీర:- ఓ దయ్యము !- దయ్యము!- ఆడుదివిడుచు కన్నీటితో భూమి గర్భధారణము చేయగల్గినచో ప్రతిబిందువుకూడ ఒక మొసలి కావలసినదే. ఛీ- నాఎదుటినుండి పో-

ప:- (పోవుచు) మీకు కష్టమైనచో ఉండను.

విజ:- నిజమునకు మంచివిధేయురాలు. పాపమామెను పిలువుడు.

వీర:- ఇదిగో !

ప:- ప్రభూ !-

వీర:- ఆర్య ! ఏమివని మీకు దీనితో ?

విజ:- ఎవరికి నాకా ?

వీర:- అవును! దానిని పిలువుమని మీరేకదా కోరితిరి? అది తిరిగి తిరిగి ఇంకను తిరుగగలదు. ఏడిచి ఏడిచి ఇంకను ఏడువగలదు. అయినను మీరనినట్లు విధేయురాలు. అతి విధేయురాలు. కానీ, తెంపులేక సాగించునీయేడ్పు ! ఈ విషయమున ఆర్య !- ఓ కప్పకూతపామా !- మాతృభూమికిరమ్మని ఆజ్ఞ అయినది. వెళ్ళు ఆవలకు ! ఇప్పుడే నీకొఆకుపంపెదను. ఆర్య ! నేనా యుత్తరువునకు బద్ధుడనై యింటికి మరలెదను. ఛీ-పో- (పద్మ పోవును) సత్యకుడు నాస్థానమునకు వచ్చును. మీరీరాత్రికి ఆర్య ! మా ఆతిధ్యముస్వీకరింపవలె. ఇచట మీకు స్వాగతము. (పోవుచు) కోతులు, ఊరపిచ్చుకలు-

విజ:- ఇతడేనా మన పరిమత్తంతయు సర్వసమర్థుడని చెప్పు పాండ్యమహాశయుడు ? ఉద్రేకము కదల్పలేని నిదాన

శీలుడు ? దైవఘటనకుగాని హఠాత్సంభవమునకుగాని తమకని సద్గుణశాలి ?

మే:-ఇతడు చాలమాఱినాడు.

విజ:- అతనిమతి మతిలో నున్నదా ? బుద్ధితూలి లేడా అతడు ?

మే:- కన్పించుచున్నట్లున్నాడు. అతడుండవలసిన రీతి నేను సరిగా తేల్చి చెప్పలేకపోవచ్చు. కాని ఉండవలసినట్లుండ నిచో, అతడట్లుండవలెననిమాత్రము దైవమునకు నాప్రార్థన.

విజ:- ఏమిటి ? తనభార్యనుకొట్టుట ?

మే:- అది అంతగా బాగుండలేదు. కాని ఇంతటితో పోవుట మంచిది.

విజ:- ఇంతేనా ఇతడెప్పుడు? లేక ఈజాబు అతనిబుద్ధిపై పనిచేసి ఈతప్పుఅతనిలో సృష్టించియుండునా ?

మే:- ఏమిచెప్పుదు ? నేకనినది, వినినది చెప్పుట నాకే మాత్రమును తగదు. నావాగ్వ్యయమవసరము లేకుండగనే మీరుకొంచెము గమనించినచో అతనిచర్యయే మీకుఅంతయు తేటపఱుపగలదు. మీరు వానిచెంతనుండి అతడు సాగించు ధోరణిచూచినచో చాలు—

విజ:- ఇతని విషయమున మోసపోయితినని చాల విచారముగ నున్నది. (నిష్క్రమణము)

## చతుర్థాంకము.

రంగము 2 కోటలోగది

ప్రవేశము నీలాంబరీ వీరసేనులు

వీర:- అయితే నీవేమియు చూడనేలేదన్నమాట?

నీ:- వినలేదు సరిగదా-అనుమానముగూడపడలేదు.

వీర:- అవును. అదియును సత్యకుడును ఒకచోటనుండుట చూచితివి కావా?

నీ:- కాని అందునాకేయుపద్రవము కన్పింపలేదు. అది గాక వారిసందున మాటిన ప్రతియుశ్వాస నిశ్వాసమునుగూడ పొర్లుపోకుండ వింటిని.

వీర:- వారెప్పుడును గుసగుసలాడలేదా?

నీ:- ఎప్పుడునులేదు ప్రభూ!

వీర:- నిన్నావలకు పంపనైనలేదు?

నీ:- లేదు.

వీర:- దాని అర్థముగాని, దువ్వెనగాని, మఱేదిగాని తెచ్చుటకుగాని?

నీ:- లేదుప్రభూ-

వీర:- ఏమీవింత?

నీ:- ఆమె నిర్దుష్టయని పందెముచెప్పుటకు నాహృదయమునొక యూపస్తంభమునకు గట్టెద. మీమనఃఫలకమున వేరు అభిప్రాయముండినచో తుడుచుకొనుడు. అట్టిది మీ అంతరంగమునే కళంకపఱచును. ఇట్టిది మీతలలో ఏతుచ్ఛుడైనను ఎక్కించినచో, ఈశ్వరుడు వానికి తనపాముకోఱల నెక్కించుగాక!

ఆ॥ ఆమెయే కళంకయై పతివ్రతగాక
నమ్మరానిటక్క_లమ్మయైన
పుడమి నేమగండు మోదింపగలడు ! సా
శీల్యమింక నెచటజేరినిలుచు ?

అట్టిచో గృహిణులలో పరిశుద్ధతాగరిష్ఠయగు నామెగూడ దుష్కీర్తివలె మలినయే.

వీర:- దానినిచటికి రమ్మనిచెప్పు- పో ! (నీల పోవును) ఇది తృప్తికరముగనే చెప్పుచున్నది. అయినను ఇది ఒక అల్పపు దూతికగనుక ఇంతకుమించి యేమియు చెప్పలేదు. ఆదో !- ఒక జిత్తులమారినక్క- దుష్టరహస్యపేటికకు తాళమును-, చెవియును. ఇట్లుండిగూడ చేతులుజోడించి, ప్రార్థించి దేవునిపై అడ్డమైన ఒట్లుగూడ పెట్టుకొనును. దానికది పరిపాటి.

ప్రవేశము పద్మాదేవి నీలాంబరి

ప:- ఏమిసెలవు ప్రియా ?

వీర:- ఇటురా పిల్లా !

ప:- ఏమి తమ ముచ్చట ?

వీర:- నీకన్నులు తేరిచూడనిమ్ము. నాముఖములో చూడుము.

ప:- ఏమి ఈభీకరవాంఛ ?

వీర:- (నీలతో) ఏదీ నీవ్యాపారము. సాధ్వీ ! ఈజంట నొంటిగ వదలి తలుపువేయుము. ఎవరైనవచ్చిరేని దగ్గుము. లేక చిటుకతో ఆవులింపుము. నీపని ! నీపని ! కానిమ్ము. వెళ్లు. (నీల పోవును)

ప:- సాష్టాంగపడి అడుగుచున్నాను. నాకు మీమాటలలోనిభావముగాక అందలి కోపము మాత్రమే అర్థమగుచున్నది.

వీర: అసలు నీ వెవతవు?

ప:- మీధర్మపత్నిని ప్రభూ! మీనిజమైన, విధేయురాలైన, ఇల్లాలను.

వీర:- రా-ప్రమాణముచేసి అధోగతికిపో. లేనివో స్వర్గపుదానివలె నుంటివిగాన యమకింకరులు సైతము నిన్నుపట్టుటకు భయపడుదురు. కానిమ్ము! నీవు నిష్కళంకవని ప్రమాణముచేసి నీఅధోగతిని రెట్టించుకో.

ప:- సత్యము దైవమునకెఱుక.

వీర:- నీవు అసత్యనిలయవు అను సత్యమే దైవమునకెఱుక.

వీర:- ఓపద్మా? వెళ్ళు-వెళ్ళు-

ప:- అయ్యో ఎంతదుర్దినము! ఏడ్చెదరెందుకు? మీకన్నీటికి నేనేకారణమా ప్రభూ? ఇప్పుడు మిమ్ము కటకమునకు పిలిపించినది నాతండ్రియేఅని మీ కనుమానమున్నచో అందుకుమాత్రము నన్ను తిట్టకుడు. అతడు మీకే లేనిచో-, ఎందుకు? నాకును లేనివాడే-

వీర:- నన్ను దుఃఖముతో పరీక్షించుటకు దైవమునకు మనసైనదిగాభోలు. దైవము నానావిధములగు వ్రణములను, అవమానములను నాతలమీద కురిపించి, నన్ను దారిద్ర్య

ములో ప్రక్కటబంటిగ నానబెట్టి, నన్నును నాయానదాశలను సంకెలలకప్పగించినను-, నాహృత్కోశమందొకమూల, సహనపు బిందువు ఒకటి దాఁచకపోదు. కాని అయ్యో! కాలచక్రము తనకదలని వ్రేలితో వెక్కిరించుటకు నన్నొక స్థిరప్రతిమను జేయుటా! అయినను దానినిగూడ భరింపగలను. మంచిది-కాని,

సీ॥ ఏకోశమందు నాహృదయనిధానమ్ము, నమ్మి నిక్షేపించినానొ తొలుత
నేయవలంబమ్ము నెనసిన జీవించు, టో లేనిచో నిల్లటో ఘటిల్ల
నేయూటలేకున్న నీజీవితాపగ, యింకకుండగ ప్రవహింపలేదొ
ఏసుధాసేచనమింత నిత్యములేక, యీప్రేమరోగిమాయింపబడునొ
ఆ॥ అట్టినన్ను తాప్రియంబెడబాసి త్య, జించునట్టి? యింక నేమిగలను
లోకమందు నుండిలేకుంటకంటె ఘోర, రమ్మగణపు అదియెరౌరవమ్ము.

లేదా కప్పలు నిరంతరము—పెనవేసికొని కనుచుండు త్రొట్టివలె నున్నను దానినంగీకరింపవలె. అరుణాధరసుందరుడవగు నో క్షమాదైవమా! ఇట్టియెడ నీస్వరూపము మార్చుకొని నరకమువలె ఘోరముగా తోచుము!

ప:- నానాథుడు నన్ను నిర్దుష్టగనే ఎంచుచున్నాడను కొందును.

వీర:- అవును. కసాయిదుకాణములో మాంసముమీద గ్రుడ్లుపెట్టి వెంటనే గర్భముధరించు పురుగులవలె.- ఇంతమనోహారముగనుండి మధురములగు వాసనలుగొట్టు ఓకలుపు మొక్కా! నీవుపుట్టకయే ఉండిన బాగుండునను భావము నీయెడ వేదనచేయుచున్నది.

ప:- అయ్యో! నేనేమి తెలియనితప్పుచేసితిని ?

వీర:- ఈచక్కనికాగితము కులటఅని వ్రాయునట్లు చేయబడినదా ? ఏమిచేసితిని ? ! చేసితివి. ఓబహిరంగ ధర్మ సత్రమా ! నీచేష్టలుగ్గడించినమాత్రన, నీసిగ్గును బొగ్గులగు నట్లు, తగులబెట్టు కొలిమితిత్తులగా నీచెక్కిళ్ళను చేయగలను. ఏమిచేసితిని?!- దానియెడ దైవము ముక్కును, చంద్రుడు కను లును, మూసికొనుచున్నారు. తగిలినదెల్ల చుంబించు తార్పుల మారి మారుతముసైతము భూమిలోని బోలుగనులలో సద్దు చేయకుండి దానిని వినుటలేదు. ఏమిచేసితిని ? ! సిగ్గులేని లంజ !

ప:- దైవసాక్షిగ నన్ను నిష్కారణముగ నిందింపు చున్నారు.

వీర:- సానివికావా నీవు ?

ప:- హరిహరి ! హైందవ విశుద్ధకులీనను. ఇతర స్పర్శ నుండి నావిభునికొఱకు ఈఘటమొక సానికాకుండుటకు జాగ్ర తగనుంచబడినదిగనుక దొరసానినితప్ప నుతేమియుగాను.

వీర:- ఏదొరకు-సానివి ?

ప:- ఎవరికినిగాను. నాకు నరకముపై భయమున్నది.

వీర:- నమ్మదగినదా ఇది ?

ప:- దైవము మనల క్షమించుగాక.

వీర:- ఇక నన్ను క్షమించు. వీరసేనుని వివాహమాడిన కటకపుజిత్తులజారిణి వనుకొంటిని. (గొంతెత్తి) జయ విజయుల వలెగాక నరకద్వార పాలనమున నున్న నోనీలా !

వీర సేనుడు.

ప్రవేశము నీలాంబరి

ఇటురా ! నీవే-నిన్నే-మాపని ముగిసినది. నాయందు దయయుంచి నోటికి తాళము వేసికో. (పోవును)

నీ:- ఈఘనుని యుద్దేశమేమి? ఎట్లుంటివి దేవీ ఎట్లుంటివి?

ప:- కలత నిద్రలో నుంటిని.

నీ:- ప్రభునకేల కోపమువచ్చెను ?

ప:- ఎవరికి ?

నీ:- నాప్రభునకు దేవీ ?

ప:- నీప్రభు డెవరు ?

నీ:- నీవాడైనవాడే దేవీ !

ప:- నాకెవరును లేరు. నన్ను పలుకరింపకునీలా ! నేనేడువ లేను. కన్నీరుతప్ప ఇంకొక సమాధానముకూడ లేదు. ఇదిగో ఈరాత్రి నాపాన్పుపై పెండ్లినాటి చీనాంబరములను పఱపుము. మఱువకు. నీభర్త నిచటికి పిలువుము !

నీ:- నిశ్చయముగా ఇందేదో మార్పున్నది. (పోవును)

ప:- నాకంతేకావలె. అంతే.-అతనికి అపోహ తట్టునట్లు పొరపాటుగనైనను నేనెట్లు ప్రవర్తించితిని ?

ప్రవేశము మేధావితో నీలాంబరి

మే:- ఏమిసెలవు దేవీ ? ఎట్లుంటివి ?

ప:- చెప్ప లేను. పసిపిల్లలను దిద్దువారుగూడ సౌమ్య పద్ధతులతో సులువుగచేయుదురు. అతడు నన్నట్లు తిట్టినతిట్టు గాక. కాని నిశ్చయముగా అన్నితిట్లకు_అలేని పసికూనను.

మే:- అసలు విషయమేమి సాధ్వీ ?

నీ:- ఏమనిచెప్పుదును? ప్రభుడీమెనుచెడిపక్రిందగట్టి సద్బుద్ధులుసహింపలేని కర్ణకఠోరములు, ఈమెపై ప్రయోగించినాడు.

ప:- నేనదే పేరా మేధావీ ?

నీ:- ఏపేరు దేవీ ?

ప:- అట్టిదాననని, నావిభుడన్నట్లు, నీల చెప్పుచున్నట్టిది.

నీ:- ఈమెను కులట యనినాడు. అలబరి బిచ్చగాడు తప్పదాగికైపులో గూడ తన చెడిపను, అట్టికూతలు కూయడు.

మే:- ఎందుకట్లు దుడుకుపడినాడు.

ప:- ఏమో నాకు తెలియదు. అంతరాత్మసాక్షిగా అట్టిదానను గాను.

మే:- ఏడువకు దేవీ! ఏడువకు. ఇంతకు దుర్దినము.

నీ:- ఎన్నోగొప్పసంబంధములను, కన్న తల్లిదండ్రులను, దేశమును, మిత్రులను, వదలినది కులట అనిపించుకొనుటకేనా? ఎవరికడుపు కోయదు ?

ప:- అది నాప్రారబ్ధము.

మే:- అతని నేమన్నను పాపములేదు. కాని, వానికెట్లు కలిగినదీ అపోహ ?

ప:- ఏమో ఈశ్వరున కెఱుక.

నీ:- ఏపై శాచికపుదుష్టుడో, ఉపాయముచే అనుగ్రహము సంపాదింపనెంచు, ఏమోసపు జానిసీడో—ఏదోపదవి

నొందుటకిట్లు పన్నకుండినచో నాగొంతుకోసికొందును. ఉరి బోసికొందును కాని-వో.-

మే:- ఛీ—అట్టివాడెక్కడను ఉండడు. అసంభవము.

ప:— ఉన్నచో దైవము వానిని మన్నించుగాక!

ని:- ఉరిత్రాడె వానినిమన్నించునది. మహానరకమే వాని ఎముకలు కొఱికి తినుగాక! అతడీమెనెందుకు, అట్లనవలె. ఎవనితో కులట? ఏప్రదేశమున? ఏసమయమున? ఏరూపమున? ఒకపేరుమోసిగిన నీచపువంచకుడు, ఈ అనుకూలదాంపత్యము నోర్వలేని ఈర్ష్యాళువు, పాండ్యున కాష్టునివలెనుండి ఈదురో్బధలు చేసినాడు.

తే॥ ఇట్టియాప్తుల నిజరూపమెఱుకపఱచి,
వాడవాడల దిసమొలతోడ నీ కు
మతుల ద్రిప్పుచు మోదంగ, ప్రతి యథార్థ
హస్తమున బెత్తమొకటుంచు మర్త్యదేవ.

మే:- గడపలోపల మాటాడు.

నీ:- అట్టివారునశింత్రుగాక. ఎవడో అట్టిమహామహుడే మిమ్ములనుగూడ నావిషయమున పాండ్యునితో అనుమానింప జేసి మీబుద్ధిని తిరుగ దోడిగినాడుగా!

మే:- బుద్ధిలేదు నీకు. వెళ్లుముందు.

ప:- మేధావీ! నావిభుడు అనుకూలుడగుటకు నేనేమి చేయవలె? మిత్రమణీ! వానికడకేగుము. ఈ దివ్యజ్యోతిసాక్షిగా అతనికెట్లు దూరమైతినో నాకే తెలియదు. ఇచట మ్రొక్కు-చున్నాను—

సీ॥ ఎపుడేని, యూహతో నేని, చేతల నేని, పతియాజ్ఞనధిగమించితినయేని
యీకన్నులీచెవులే యింద్రియములైన, పెఱరూపమగుసౌఖ్య మెఱుగు నేని
వెనుక నేనియు,నిప్పుడును,ముందునైన,నెవ్వఁడుగ వానికెప్రియింపదనయేని
వానిచే విడువంగబడి కూడులేని పాటులుపొందిగూడ తిట్టుదునయేని.
ఆ॥ శాంతి సుఖము నన్ను శాశ్వతమ్ముగవీడు, గాక.మఱల జన్మగాంచియైన
నతనిదయకు పాత్రనగుదుగా కమ్మహా, మహునకెపుడు ముద మె,మఱియు
గాక !

నిర్దయ ఎంతయైనను చేయవచ్చు. అతని నిర్దయ నాజీవితమును తుదిచేయవచ్చునే కాని నా ప్రేమకుమాత్రము కళంకము, ఆపాదింపలేదు. కులట ? ఏమిటది ? నోట పలుకలేకున్నాను. ఇప్పుడన్నందుకు జలదరించుచున్నది. ఆబిరుదు సంపాదింపగల పనిని ఈ ప్రాపంచిక వైభవమంతయుగూడ నాచే చేయింపలేదు.

మే:- ఊరడిలు దేవీ ఊరడిలు! అది అతనిచిరాకు సమయము. రాజకీయము లతనికి వ్యతిరేకించినవి. ఆ రేగుడు మీాపైజూపుచున్నాడు.

ప:- మఱేమియు కాకుండినచో—

మే:- గట్టిగ చెప్పుచున్నాను. అంతకుమించి ఏమియు గాదని.-(లోనవాద్యములు) వినుడు, ఈసాధనములుభోజనమున కెట్లాహ్వానించుచున్నవో! కటకపు పౌరులు విందుకై వేచి యుండిరి. లోన కేగుము ! దేవీ ఏడువకు. అన్నియుచక్కబడును. (నీలాంబరి పద్మాదేవి పోదురు) ప్రివేశము: నటేశము

ఏమి విశేషములు నటేశ !

నటే:- విశేషములా? నాయెడ నీప్రవర్తన మేమంత

ధర్మముగ లేదు.

మే:- నిన్ను కాదని చేయుచున్న దేమి :

న శే:- నిత్యమును ఏదో వంక జెప్పి మాయబుచ్చుచుం టివి మేధావి! మీదుమిక్కిలి ఆశలోని కనీసపులాభములను కలుగజేయుటకు బదులు అన్నివిళ్లకు నన్ను దూరస్థునిజేయు చున్నటులుగూడ నాకిపుడిపుడు గోచరించుచున్నది. ఇకమీద ఏమాత్రము ఓర్చుకొనలేను సరిగదా బుద్ధితక్కువగా ఇదివఱకు నష్టపడినదానికి ఇక నోరుమూసికొని ఊరుకొన దలచలేదు.

మే:- నామాటవిందువా సఖా!

న శే:- వెక్కసముగ వింటిని. నీమాటలకును చేతలకును జ్ఞాతివైరమున్నది.

మే:- నన్ను, అక్రమముగ నిందింపుచుంటివి.

న శే:- అక్రమముగగాదు సక్రమముగనే. నాజీవ నాధా రమునుండి నన్ను వెచ్చించుకొంటిని. పద్మకిచ్చులకని నీవు నావద్దనుండి గుంజినసొమ్ము లీపాటికొక అనుంభతిని లాంగదీసి యుండెడివి. ఆమె వానిని గ్రహించినదనియు శీఘ్రసౌఖ్యాను భవమునకు సిద్ధముగ నోరు తెఱచుకొని యుండుమన్నదనిగూడ చెప్పితివి. కాని ఒక్కటిగూడ లేదు.

మే:- సరే మంచిది, సరేపో.

న శే:- సరేపో?! నేనుపోను. నీకదిమంచిదికాదు. చాల నీచము. ఇందులో పూర్ణముగ మోసముచేసినట్లు నాకను మానము వేయుచున్నది.

చేసితివా ? ——

మ॥ తనువుం బొందినవానికిన్ ఫలము సద్యోభోగమూలమ్ము నం
గనుటే తథ్యము; నీవ్రరేఖ నిశిదాకన్ సైవ్రమ్మైన; నిం
దున భేదించినవాడు, ద్రోహిగ, నన్నుం బుద్ధి నూహించి, మే
దినికిం బాపగ, సర్వశక్తుల బ్రయత్నింపందగున్ మిత్రమా!

నటే:- ఏమిటిది? యోచనకు, శక్తికి, అందికలోని దేనా.

మే:- విను, వీరసేనునిస్థానమున సత్యకుని నియమించుచు మాతృభూమినుండి ప్రత్యేకపుటుత్తరువు వచ్చినది.

నటే:- నిజముగా ? అట్లగుచో పద్మాసుందరితోగూడ వీరసేనుడు ఇంటికిమఱలును.

మే:- ఓ కాదు. అతడు తనభామతో సింహాళమునకు బోవును. కావున నతనిప్రయాణము భంగమైనగాని వాని ముద్దులాడి ఇచట ఆగదు. అట్లుభంగమగుటకు అతనియావాసమున కేదైన వచ్చిపడవలె. అట్లు వచ్చుపడుటలు సత్యకుని కాజేయుటవంటి అమోఘమైనది ఇంకొకటిలేదు.

నటే:- ఆ కాజేయుటెట్లని నీభావన ?

మే:- పుచ్చె ఎగురగొట్టి—, అపుడుగాని వీరసేనుని స్థానమునకు వాడు అనర్హుడుగాడు

నటే:- అది నేనే చేయవలెననియా ?

మే:- అవును నీకు లాభకరమగు ప్రయోజనమును సాధించుకొన సాహసించుచో విను!- వాడీరాత్రి తన యుంపుడు గత్తెతో తినుటకుబోవును. అచటికి నేగూడ పోదును. తన

గౌరవప్రదమగు అదృష్టమును వాడింతవఱకెఱుగడు. వాడచటికిపోవుట రెండుమూడు జాములమధ్య పడునట్లు చేసెద. కనుక నీవు కాచుకొనియుండినచో వానిని, నీచిత్తమువచ్చినట్లు చేయవచ్చు.నీయత్నమునకు,ఊతమిచ్చుటకునీదాపుననేఉందును' అప్పుడు అతడు మన ఇద్దఱసందున చిక్కును. ఇటురా! ఆవిధముగా నిర్ఘాంతపడక నావెంటమాత్రమురా !— ఇది అగత్యమైనదని నీకై నీవే అనుకొనితీరునట్లు వానిచావులోని ఆవశ్యకతను నీకు చూపించెద. ఇప్పటికే భోజనసమయ మతిక్రమించినది. కాలయాపనమగుచున్నది. నీకు రెండవ ఆలోచనవద్దు.

నశే:— నా కింకను ప్రబలకారణములు కావలె.

షే:— నీమనసుకు నచ్చితేసరి— (నిష్క్రమణము)

రంగము 3 కోటలో మఱొకగది

ప్రవేశము వీరసేనుడు, విజయమూర్తి, పద్మ, నీల, పరిచారకులు

విజ:— నాయందుదయయుంచి ఆర్య! మీరికశ్రమ పడకుడు.

వీర:— ఓ క్షమించుడు. నాకు నడకమంచిది.

విజ:— అమ్మా వచ్చెదను. స్వవికనుండుము.

ప:— బాబూ! దయయుంచవలె. సెలవుపుచ్చుకొందును.

వీర:— వెళ్ళుదమా ఆర్య! పద్మా!

ప:— నాథా!

వీర:— వెంటనే తిరిగివత్తును. నీపరిచారికనుపంపివేయుము.

ప:— చిత్తమట్లే చేసెదను. (వీరసేనుడు, విజయమూర్తి

పరిచారకులు పోదురు)

నీ:- ఇప్పుడెట్లున్నది దేవీ! వెనుకటికంటె కొంచెము మెత్తగిలినట్లున్నాడే.

ప:- ఇప్పుడే వచ్చెదనని చెప్పిపోయినాడు. నేనుపడకకేగి నిన్ను పంపివేయవలెనని ఆజ్ఞయైనది.

నీ:- నన్ను పంపివేయుమనియా ?

ప:- అది వానియాజ్ఞ. కావున నీలా! నాకు పక్క వేసి సెలవుపుచ్చుకో. ఇప్పుడు అతనిమనసునొప్పింపరాదు.

నీ:- నీవతనినెప్పుడును చూడకయేఉండిన ఎంతబాగుండెడిది ?

ప:- నేనుమాత్ర మట్లనుకొనను. అతని పెంకెతనములు- గద్దింపులు, ధుమధుమలు--ఇదిగో ఇక్కడ సళ్ళించు—వీనిలో గూడ దయానురాగములున్నవిగనుక, నాప్రేమ అతనినంతగ మెచ్చుకొనుచున్నది.

నీ:- నాకుచెప్పినవలువలనే నీపడకపై పఱచితిని.

ప:- అది అంతలెక్కలోనిదికాదుగాని— నిశ్చయముగా మనమనసు లెంతపిచ్చివి ?

క॥ మనయిద్దఱిలో నీకం
ఠెను నే మును మృత్యువుంగనినచో నాయీ
తనువుపయి వీనిలోని వ
సనమొక్కటి గప్పఁగాలసను నాకిదియే.

నీ:- ఏమీ ధోరణి ?

ప:- మాతల్లియొద్ద సుమతియనుకన్య యుండెడిది. అది యొకనిని ప్రేమించెను. కాని వానికి పిచ్చెత్తి దానిని త్యజించెను. దానికొక విరహగీతమువచ్చెను. చాల పురాతనమగు నాపాట సుమతియదృష్టములను తెలుపును. ఆపాటనుపాడుచు అది ఊపిరి విడచినది. ఈరాత్రి ఏలనోనీలా! ఆపాట నాయెదుటి నుండి పోవుటలేదు. నాతలఅంతయు ఒక వైపునకువరగి వ్రేలాడ కుండుటకును, పాప మా సుమతివలె పాడకుండుటకును నేనెంతయో యత్నింపవలసి వచ్చుచున్నది. ఇక పోదువా?

నీ:- పోయి నీసరిగంచుచీర తెత్తునా?

ప:- వద్దు. ఇచట బిగించు. ఈ విజయమూర్తి చాల మంచివాడు. సరేకాని—ఆకన్య ఒక సెలయేటిపొంతనున్న ఒక మద్దిచెట్టుక్రిందచేరి పాడినది. విను ఆవాయుగీతిని (పాడును)

గేయము

వాయుదేవ! నాప్రియునకు నావెత దెలు, పవె యిపుడీ సెలయేటు
నాయవస్థ కల్లనేడ్చుచు నన్నుగ, నంజాల కెటకో పాలు
వినవాని దెగడకు డేరు
వాని చిరచిరన సుకసెమీాలు    వా॥

త్వరచేయుము నీలా! అతడిపుడేవచ్చును. (పాడును)

పతిలాతినోల్లను కోరకు మెరునని, యత దనుటను వాలించి

కాదు. చరణమదిగాదు. విను. విను. ఆతట్టునదెవరు?

నీ:- మరేమియుగాదు. గాలి.

ప:- (పాడును)

వితయయ్యో సకమ్మనపాటననుచు నా, ప్రేమనెన్నేదూషించి

ఏన సూడవతి జన్మించి
వానిబొందెద నినునే ఎంచి వా॥

మంచిది. ఇక నీవుపో. నాకుడికన్ను పురద పుట్టుచున్నది. ఏది ఏమువునకు సూచనా ?

నీ:- అదేమియునుగాదు.

ప:- అట్లని చెప్పగాపింటని. అహా కాపురుషులు, ఈ పురుషులు ఎట్టివారు ? నీఅంతరాత్మలో ఎప్పుడైనను నాకుచెప్పు నీలా—తనభర్తనంత నీచముగ మోసగించు ఆడుది ఎచటనైన ఉండుననుకొందువా ?

నీ:- కొందఱుందురు. సందేహము లేదు.

ప:- ఈప్రపంచమంతయు ఇచ్చినను అట్టిపని నీవుచేయుదువా ?

నీ:- ఏమి నీవుచేయవా ?

ప:- చేయను. ఈ దీపముతోడుగా చేయను.

నీ:- నేనుకూడ, దీపముతోడుగా చేయను. కాని చీకటి తోడుగా చేయుదును.

ప:- ఈ ప్రపంచమంతయు ఇచ్చినను అట్టిది నీవుచేయుదువా ?

నీ:- ఈ ప్రపంచము అపారమైనది. చిన్నసాహసమునకు, అది ఒక పెద్దలాభము.

ప:- ముమ్మాటికి నీవట్లుచేయుదువా?

నీ:- ముమ్మాటికి నేనట్లుచేయుదును, అట్టిది చేసినమీదట

దానినిలేకుండ చేయుదును. అట్టిది ఒక ఉంగరమునకుగాని, మంచి చీరకుగాని, విలువైనసొమ్మునకుగాని, మరేబహుమతికి గాని చేయను. కాని ప్రపంచమంతటికొఱకు:- ఎందుకు ? తన భర్త నొకప్రభువునుచేయుటకు—అతనిని అంకుటాలిమగనిగా ఎపటెచేయదు ? నేనుమాత్రము రత్నముకొఱకు తక్కువైనను కొట్టుదును.

ప:- నేనుమాత్రము ప్రపంచమంతటికొఱకుగూడ అట్టి తప్పిదము చేసినచో ఛీ అని పిలువుము.

వీ:- ఎందుకని ! ఈ ప్రపంచమును నీకృషిచే సంపాదించినపుడు ఆతప్పు నీప్రపంచములోనిదే అగునుగనుక, వెంటనే దానిని ఒప్పుగా మార్చవచ్చు.

ప:- అట్టి యాడుదెచటను ఉండదనియే నానమ్మకము.

ప:- ఎందుకు ? ఒక వందమంది. తమ ప్రవర్తనవలన ప్రపంచమంతయు ఫలితముగావచ్చుచో అట్టి ప్రపంచముకూడ కూడబెట్టలేనందఱు.- నామతమున భార్యలు పతితలగుచో భర్తలదోషమే. వారు తమ ధర్మములను మంటగలిపి మన సొత్తుల నితరుల ఒళ్ళలో ధారపోయుదురు. పైగా చిలిపిఅను మానములుపడి మనపై ఒత్తిడి చేయుదురు. ఇంకను—మనలను కొట్టి వైమనస్యముతో వెనుకటి ఈవినితగ్గింతురు. కాని, మనకు మాత్రము రాగద్వేషములులేవా ? కొంత మెత్తదనమున్నను మనకును మత్సరమున్నది. భర్తలు, తమవలెనే భార్యలకుకూడ నింద్రియజ్ఞానమున్నదని తెలిసికోవలె. వారికివలె మనకుగూడ

చూచుటకు, వాసనచూచుటకు, రుచిచూచుటకు, ఆనందించుటకు, దైవముఇట్టి శరీరమునే ప్రసాదించినాడు. ఇతరులకుగా మనలను మార్చివేయుదురే!-ఏమిపనిఅది? వినోదమా? వాంఛాజన్యమా ? మనోదౌర్బల్యదోషమా ?— అవును. ముమ్మాటికి అంతే.

చ॥ మనకయినన్ చెలీ! పతులమాత్రి విలాసములందుకోర్కి, నూ
తనములపై ప్రియమ్ము తగదా? మగవారలకన్న బుద్ధి ని
ల్పునె మనకంతగా? సుభరయులుందగురీతి జరించుటొప్పు; గా
వున మనపట్ల యుక్తముగబోవుటయే తగు వారికేనియున్.

ఒకరికి తప్పైన ఒకరికి కాకపోదు.

ఆ॥ వారుచేయు తప్పుపనులె మనకుగూడ,
దారిచూపి చేయనేరుపునని
బుద్ధిచెప్పవలయు పూరుషులకు; వారి
వలనగాక నింతవట్టు చెడము.

పద్మ:- మంచిది. ఇకసెలవుపుచ్చుకో. చెడుగునుండి చెడుగునేర్చుకొనక ఇతరుల చెడుగుచే బాధపడి దిద్దుకొను జ్ఞానము దైవము ప్రసాదించుగాక. (తెరపడును)——



# వీ ర సే ను డు

## [పంచమాంకము]

### ఒ క ట వ ర ం గ ము

సుమిత్రా పట్టణవీధి. ప్రవేశము మేధావీ నటేశులు.

మే:- ఇదిగో ఈమొత్తచాటున నిలబడుము. అతడు సరాసరి వచ్చును. నీ బాకుతీసి సిద్ధముగా ఉంచి దూసికొనిపోవునట్లు పొడువు. కానీ-కానీ- ఏమియుభయపడకుము. వీపులమీదనే ఉందును.

తే॥ మనల మేరువు నెక్కించినను రసాత
లమ్మునకు ద్రొక్కినను నిదేసుమ్మి సఖుడ!
గాన నీనిశ్చయము పరధ్యానమందు
నిలుపకీచటనె నిద్రింపవలయు నిపుడు.

నటే:- చేతి కందుబాటులోనుండుము సుమా! గురితప్పిపోవచ్చు.

మే:- ఇచటనే ఉందును నీచేతివద్ద—బిక్కగానుండక ధైర్యముతోనిలువు. (డాగును)

నటే:- నాకీపనిపై అంతపట్టుదల ఏమియులేదు. కాని అతడు నచ్చజెప్పినాడు. ఇంతకు పోవునది ఒక్కడు. ఇదిగో నాకత్తి.- చచ్చితీరును.

మే:- నేనీమొటిమను దురద హెచ్చునట్లు నలిపి గిల్లి విషమించునట్లు చేసితిని. వీడు రుద్రుడై మండుచున్నాడు. ఇప్పుడు

వీడు సత్యకునిజంపినను, లేక సత్యకుడే వీనినిజంపినను, లేక సుందోపసుందులవలె ఇద్దఱుచచ్చినను అంతయు నాలాభము నకే. నటేశము బ్రతికెనా-పద్మాదేవికి కానుకలిచ్చుటకని నాని వద్దనుండి గుంజినసొమ్మును బంగారమును తిరిగి ఇచ్చివేయుమని గోలచేయును. అది జరుగరాదు. సత్యకుడు బ్రతికెనా-, అతని జీవితమున దినమొకచాయ అగుపడి వానియెదుట నేను పనికి మాలిన వాడనగుచున్నాను. ఇదిట్లుండగా—

క|| ఇతని కిటులంచు నాదు చ
రితముల్ పాండ్యుంకు వెలువరించినయెడ నా
బ్రతుకే సందియమూటు, ని
హతుండె గావలయు సత్యకాధము డిపుడే.

అదిగో వచ్చుచున్న అలిడికి వినబడుచున్నది.

ప్రవేశము: సత్యకుడు.

నటే:- (స్వ) వానినడక నేనెఱుగుదు. అదివాడే. (ప్రకాశము) అరే దుష్టా చచ్చితివిరా— (సత్యకుని పొడుచును)

స:- నిశ్చయముగ ఆపోటు ప్రాణాంతకమే. కాని నాకవచబలము నీవెఱుగవు. ఇక నీదానిబలము చూతునురా లుచ్ఛ (నటేశుని గాయపఱచును)

నటే:- అయ్యో చచ్చితి-చచ్చితి- (వెనుకనుండి మేధావి సత్యకుని కాలు విఱుగగొట్టిపోవును)

స:- అయ్యో నాకాలుతెగినది. కూనీ-కూనీ- (పడును)

ప్రవేశము దూరమున వీరసేనుడు

వీర:- (స్వ) అది సత్యకస్వరమే-మేధావి తనమాట

నిలుపుకున్నాడు.

నటే:- హా ! నేనెంతపాపిని !

వీర:- (స్వ) నిజమే-

స:- హా బాబో-రక్షింపుడు. దీపము ! వైద్యుడు !-

వీర:- (స్వ) అదివాడే. ధైర్యశాలీ మేధావీ ! నాఅవమానమును సహింపలేని నీఅవ్యాజ మిత్రధర్మ మెంతటిది ? నాకు దారిజూపుచున్నావు. ఓసీ తప్పుడుదానా !_ నీప్రియుడు చచ్చిపడి యున్నాడే. నీ విపరీతప్రారబ్ధము దుముకుచున్నదే పడపుదానా ! వచ్చుచున్నానే. నాహృదయమునుండి నీవలపులు, మెఱుపులు, నీ విలోలనేత్ర తాళతళ్యములు తుడిచి వేయబడినవి. కామకళంకితమగు నీ పాన్పులోనే నిన్ను పూడ్చిపెట్టెదనే!-(పోవును)

ప్రవేశము విజయమూర్తి, సౌవర్ణి

స:- ఏమి అయ్యో ! కావలివారెవరును లేరా ! ఎవరు తిరుగుటలేదా ? హత్య బాబో హత్య !-

సౌ:- ఎవనిదో మూడినది. భీకరముగా నున్నదా ఆర్తధ్వని-

స:- బాబో రక్షింపుడు.

నటే:- ఎంతపాపమురా-

విజ:- ఇద్దఱు ముగ్గురు ఏడుచ్చుచున్నారు. కాళరాత్రి. మోసగించుటకేమో ! ఇదిజూడ నాకు ఇంకను కొంత సహాయసంపదలులేక ఆమొఱలోనికి ప్రవేశించుట" అంతక్షేమకరముగ

దోచుటలేదు.

నటే:- ఎవరునురారా- అట్లగుచో నేనీరక్తవాహినితో చావవలసినదే—

విజ:- విను. విను.

ప్రవేశము దీపముతో మేధావి

సౌ:- చొక్కాతో, దీపముతో, ఎవడో సాయుధుడై వచ్చుచున్నాడు.

మే:- ఎవరక్కడ ? హత్యయని మొఱపెట్టినదెవరు ?

విజ:- మాకు తెలియదు.

మే:- అఱపులు వినలేదా ?

స:- ఇక్కడిక్కడ- పుణ్యముండును రక్షింపుడు.

మే:- ఏమిసంగతి ?-

సౌ:- ఇతడు వీరసేనుని మహామాత్రుడుగా దోచుచున్నాడు.

విజ:- అతడే నిజముగా—బలే ధైర్యసాహసములవాడు.

మే:- ఇంతదైన్యముగా అఱచెడువారెవరు ?

స:- మేధావీ ! నాకాలు తుంపులైనది. తుంటరులెవరో నన్నిట్లుచేసిరి. రక్షింపవలె.

మే:- అయ్యో! అయ్యో! దండపతీ ఏదుష్టులు నిన్నిట్లు చేసినది ?

స:- వారిలో నొకడీచాయనే ఉండవలె. పాఱిపోలేదు.

మే:- (విజయమూర్తి సౌవర్ణులతో) ఆహా ఎంత

ఘోరము! మీరెవరు అంతదూరమున నుంటిరి. ఇచటికివచ్చి కొంచెముసాయము రండు.

నశే:- ఓ ఇక్కడుంటిని-రక్షింపుడు రక్షింపుడు.

స:- అదిగో వాడే వారిలో నొకడు.

మే:- అరే కటికదొంగా-పాపీ (నశేశుని పొడుచును)

నశే:- ఓరి ద్రోహీ! మేధావీ! అమానుషవుకు కా-(చచ్చును)

మే:- చీకటిలో గొంతులుగోయుటా? ఈ క్రూరపు దొంగలెచటనుందురు? పట్టణమెంత నిశ్శబ్దముగ నున్నది. కూనీ! కూనీ! మీరెవరు దొంగలా దొరలా?

విజ:- చూచినపుడు తెలియును?

మే:- ఆర్య! విజయమూర్తి!

విజ:- అవును నేనే.

మే:- క్షమింపవలె. దుష్టులచే సత్యకుడిచట పడి యున్నాడు.

సౌ:- సత్యకుడు?

మే:- ఎట్లున్నది సఖా!

సత్య:- నాకాలు రెండుతుండెములైనది.

మే:- దైవమురక్షించుగాక! దీపము! ఎవరో దీపము! నాచొక్కాతో కట్టెద.

ప్రవేశము: నాగమణి.

నా:- ఏమిసంగతి? ఇప్పుడఱచినదెవరు?

మే:- అఱచినదెవరా ?

నా- ఓ న్రాపియ సత్యక ! అయ్యో అయ్యో సత్యక ! ఏమిది?

మే:- ఛీ—బలిసినదాన ! సత్యక ! ఈవిధముగ నటికి నందుకు ఎవరిపైనను నీకనుమాన ముండెనా ?

స:- లేదు.

సౌ:- మిమ్ములనిట్లు చూడవలసినందుకు నాకెంతయు చింతగనున్నది. మిమ్ము వెతకుచువచ్చితిమి.

మే:- నాకొక పెద్ద పేలికనిండు. ఎవరు ? ఇతనిని తేలికగా మోసికొనిపోవుటకు కుర్చీ తెప్పింపుడు.

నా:- అయ్యో ఇంకేమున్నది. సోలిపోవుచున్నాడు- అయ్యో సత్యక-సత్యక !—

మే:-పెద్దలందఱు వినుచుంటిరా? ఈకుట్రలో ఈపడపుది కూడ ఉన్నట్లు నాకనుమానము. కొంచెమోర్చుకో సత్యక ! రండు రండు. దీపమొకటి ! ఈమొగము మనమెఱిగినదా ఎఱుగనిదా ? అయ్యో అయ్యో నామిత్రుడు నటేశము ! కాదు- అవును. అతడే- హరిహరీ ! నటేశము !-

సౌ:- కటకపు నటేశము ?

మే:_ అతడే అతడే ఎఱుగుదురా ?

సౌ:- ఎఱుగుదును? ! చక్కగ-

మే:_ ఎట్లున్నది సత్యక ? కుర్చీ ! కుర్చీ !-

సౌ:- నటేశమా ?

మే:- అక్కడలేదు, అతడే. (కుర్చీ తెత్తురు) వచ్చినది గద- మంచిది. ఎవ్వరైన పుణ్యాత్ములు వీని నావలకు మోచి కొనిపోండు. (నాగమణితో) నీవుమాత్రముతల్లీ ! లేనిపోనిశ్రమ పెట్టుకొనకు- ఇక్కడ ఈచచ్చినవాడు సత్యక ! నా ప్రియమిత్రుడే!-, మీా ఇద్దఱనడుమను ఉన్నపగ ఏమి ?

స:- ఈ లోకమున ఏదియులేదు. వాడెవడో కూడ ఎఱుగను.

మే:- (నాగమణితో) ఏమిటి ? వెలవెలబోవుచుంటివా? ఓ వానిని గాలిలోనుండి ఆవలకు మోచికొనిపోండు. (సత్యక నటేశులను మోయుదురు) అయ్యో పెద్దలందఱు ఒక్కక్షణ ముండుడు. ఎఱుగనట్లు తెలతెలబోవుచున్నావా తల్లీ ! దాని కన్నులలోని గజగజను చూచితిరా ? ఆ! ? నీవట్టేచూచినను మేమంతయు కనిపెట్టగలము- దానిని సరిగాచూడుడు. మీారు దానిని చక్కగ గమనింపుడనియే నామనవి. అయ్యో చూచుచుండిరా ? పెదవికదల్పకున్నను చేసినచేతలు మొగమేచెప్పును.

ప్రవేశము: నీలాంబరి.

నీ:- అయ్యో ఏమి టేమిటి ? ఏమిటిప్పుడునాథా !

మే:- ఏలనో నటేశమును కొందఱు పాఱిపోయినతుంటరులు కలిసి చీకటిలో మనసత్యకునిపై బడిరి. నటేశముచచ్చెను. సత్యకుని తలప్రాణములు తోకకువచ్చినవి.

నీ:- అయ్యో సత్యక ! అయ్యో అయ్యో సత్యక !

మే:- ఇది సానులనుంచుకున్నఫలము. చూడు నీలా !

సత్యకుడీరాత్రి ఎచట తినెనో కనుగొనిరా ! (నాగమణితో) ఈ మాట, అనగానే వణకిపోవుచుంటివా ? ఆ?!——

నా:- నాయింటనే భుజించినాడు. కనుకనే నాకు వణకు లేదు.

మే:- ఓ అది ! నీయింటనే భుజించినాడుగా ? నీసంగతీ విచారింపవలె. రా నాతో !-

నీ:- ఛీ ఛీ విడిచినదాన !

నా:- నేనేమియుగాను-నన్నిట్లు దూషించు నీవంటి మంచిదాననే నేకూడ—

నీ:- నావంటి ? ఛీ—ఛీ— సిగ్గు లేదునీకు—

మే:- అయ్యో మనమువెళ్లి పాపము సత్యకుని కట్టు చూతము- రా తల్లీరా !- నీకథమాకు సరిగాచెప్పుదువుగాని!- కోటవద్దకు పఱుగెత్తుకొనిపోయి నీలా ! ప్రభువునకును ప్రభ్వికిని ఈ జరిగినదంతయుచెప్పు. వెళ్లుదువా ? వెళ్లు- (స్వ) నన్ను హింస జేయుటగాని క్రుంగతీయుటగాని చేయవలసిన దీరాత్రియే.

(నిష్క్రమణము)

రంగము ౨ కోటలో పడకగది.

పడకలో నిద్రింపుచు పద్మాదేవి. దీపము వెలుగుచుండును.

ప్రవేశము: వీరసేనుడు

వీ:- అది కారణము ! హృదయమా అదికారణము ? పరిశుద్ధ తారకలారా ! మీకదిపేరెత్తిచెప్పను. అదికారణము·

ఆయినను దానికి రక్తపాతము గావింపను. జీడిమామిడిపండు
లోని తేటకాంతియు మార్దవమునుగల దానిచర్మమును మఱక
పఱచను. కాని అది చచ్చిపోవలె. అబ్బో! లేనిచో ఇంకను
పెక్కురను మోసగించును. మొదట ఈజ్యోతినార్పెద. పిమ్మట
నీజ్యోతిని!— ఉద్దీప్తమై వెలింగెడు ఓ దీపికారాజమా! నిన్ను,
ఆర్పినచో నాకు పశ్చాత్తాపమైననాడు మఱల నిన్ను నీపూర్వ
ప్రకాశస్థితికి తేగలను. కాని అపూర్వ వంచకమార్గదర్శకమా!
నీజ్యోతిని, ఒక్కమారార్పితినో, దానిని మఱల వెలిగింపగల,
సర్వాభక్షకత్వమెల్లకడాగిన, ఆపవిత్రాగ్ని ఎచటనుండెనోగదా!

తే॥ చేతులార గులాబి ద్రుంచితినయేని,
వశమెట్లొ నాకు మఱల! జీవంబుపోయి
వాడి యది నశియించిపోవలయు; గాన,
కుజముపై నున్నయపుడె మూర్కొందుదాని— (మూర్కొనును)

ఆహా! ధర్మదేవతకు సైతము తనపాశమును పాఱవే
యుమని చెప్పదగిన ఈనిశ్వాసము శమనకరమై ఎంతహాయిగ
నున్నది! ఇదే కడసారిది. ఇంకొకటి—ఇంకొకటి— శవమైనపుడు
కూడ ఇట్లేతోఁచుము. నిన్నిపుడుచంపెద. పిమ్మట గాటముగ
ప్రేమింతును. ఇంతమధురమైన ఈనిశ్వాసము ఇంతప్రాణాంత
కముగ నెప్పుడును ఉండకూడదే—

మ॥ రమణీ, దుఃఖము పెల్లు నాపుటకు నేరన్; గాని, నా బాష్పపం
క్తి, మహాక్రూరము; నీకు సద్గతిని ప్రాప్తింపంగజేయన్ పవి
త్రముఖంబిప్డు డౌనర్తు; నాదయిన చిత్తంబెద్ది ప్రేమించు గా
టముగా, దానినె తాను నిర్దయత కొట్టంబోవుచుండెంగదే!

పీ: లేచుచున్నది!-

ప:- ఎవరక్కడ ప్రియా!

వీర:- నే నే పద్మా!

ప:- శయనింతురా నాథా!

వీర:- ఈరాత్రి పద్మా! ప్రార్థనజేసికొంటివా?

ప:- చేసితిని నాథా!-

వీర:- ఇప్పటికిగూడ దైవకృపకు మనవిచేయని ఏదేని తప్పు నీవుచేసినట్లుతోచినచో-పద్మా-నిరభిమానవై తత్తహృదయముతో మన్నింపుమని వేడుకో.

ప:- ఇట్లుచెప్పుటలో మీభావమేమి?

వీర:- క్లుప్తముగా గానిమ్మా. ఇచటనే తిరుగుచుందును. సిద్ధముగలేని నీ జీవము తీయను. కాదు. దైవమురక్షించుగాక- నీ ఆత్మనుచంపను.

ప:- చంపుటేమిటి?

వీర:- అవును అదియే.

ప:- దైవము నన్ననుగ్రహించుగాక!-

వీర:- తథాస్తు-మనఃపూర్వకముగ-

ప:- అట్లుచెప్పుటచే నన్నుచంపరని ఆశగనున్నది-

వీర:-మ్-

ప:- అయినను మీరనిన భయముపుట్టుచున్నది. ఆవిధముగ గ్రుడ్లుఱుము మీరు మృత్యువువలె తోచుచుండిరి. ఏ అపరాధము ఎఱుగనుగాన ఏలభయపడుచుంటినో నాకే తెలి

యుటలేదు. కాని భయపడుచున్నాను.

వీర:- నీపాపములను స్మరించుకో.

ప:- అవి మీయెడ నాకుగలప్రేమయే.

వీర:- అవును-అందుకే చచ్చెదవు.

ప:- ప్రేమించినందుకు చావువచ్చుటవిరుద్ధము. అయ్యో ఎందుకు అట్లుపండ్లుగొఱికెదరు ? ఏదియో క్రౌర్యోద్రేకము మిమ్ము నిలువెల్ల ఊచుచున్నది. ఇవియే ఉత్పాతములు. అయినను అవి నాకై ఉద్దేశింపబడినవి కావని నాకిప్పటికిని ఆశయున్నది.

వీర:- నెమ్మది. సద్దుచేయకు-

ప:- అట్లేయుండును. అసలెందుకు మీకుకోపము-

వీర:- నేనంతగ ప్రేమించి నీకిచ్చిన నా రుమాలును సత్యకున కిచ్చితివి.

ప:- ఛీఛీ- నాప్రాణములతోడు. లేదు. నా అంతరాత్మసాక్షిగా——అతనిని పిలిపించి అడుగుడు-

వీర:- మధురహృదయమా ! జాగ్రత జాగ్రత-! అంత తేలికగ అప్రమాణములు చేయకు——మృత్యుశయ్యమీదనుంటివని తెలిసికో-

ప:- కాని అప్పుడే చచ్చుటకుమాత్రముగాదు.

వీర:- అవును. ఇప్పుడే. కాబట్టి శంకింపక నీపాపములను ఒప్పుకో— ప్రతిఅక్షరమును ప్రమాణముచే నీకాదనుట, నా ముమ్మాటికి నిశ్చితాభిప్రాయమును ఆపనుగాని మాపనుగాని

సమర్థముగాదు. నీవు చావనుంటివి.

పః- ఇక దైవమే నాకుదిక్కు.

వీరః- తథాస్తె అనుచుంటిని-

పః- మీరుకూడ నన్నుకరుణించుడు — నా జన్మలో మీకే అపరాధము చేసియెఱుగ—భగవదాజ్ఞా ప్రకారము చూపవలసిన సర్వభూత దయాళుత్వముతోదప్ప ఇతరముగా సత్యకునెన్నడును ప్రేమించియుండలేదు - అతనికా లాంఛన మీయలేదు—

వీరః- దైవసాక్షిగ నారుమాలు నతని చేతజూచితి. ఓసీ తప్పుడు ఒట్లదానా! నాగుండెకాయిచేసి నేను యజ్ఞమని చేయబూనినదానిని హత్యయని పిలుచునట్లు చేయుచుంటివి. నేనా రుమాలును చూచితిని—

పః- అయితే అతనికది దొరకియుండవలె వానికి మాత్రమెన్నడు నేనిచ్చియుండలేదు. ఇటనుండియే వానికొఱకు పంపి అతడు నిజమొప్పుకొననిండు.

వీరః- ఒప్పుకొనినాడు.

పః- ఏమని ప్రభూ!

వీరః- నిన్ను తాను వాడుకొనినట్లు.

పః- ఎట్లు? అధర్మముగ?

వీరః- అవును.

పః- అతడట్లు చెప్పునా?

వీరః- ఇంకేమిచెప్పును? వానికి నోరుపడ్డది. విశ్వాస

శీయుడగు మేథావి అందుకు ఉత్తరువుపొందియున్నాడు.

ప:- అయ్యో—, ఆతడు చచ్చెనా ఏమి ?

వీర:- వాని రోమములన్నియు జీనములే అయినను వానినన్నిటిగూడ మ్రింగుటకు నాపగకు కుక్షి ఉన్నది.

ప:- హా ! హతాస్మి. వానికి మోసముజరిగినది.

వీర:- తప్పాడుదానా ! నాముగమెదుట వానికై ఏడ్చుచుంటివా ?

ప:- నన్ను వెడలగొట్టుడు ప్రభూ ! కాని చంపకుడు

వీర:- ఇంకను ఆగుటా ?

ప:- రేపుచంపుడు. ఈరాత్రికిమాత్రము బ్రతుకనిండు.

వీర:- వీలుపడదు——నీవు పెనుగులాడితే?

ప:- ఒక అరగంటమాత్రము.

వీర:- జరుగుచుండగా ఆగుట ఉండదు.

ప:- కాని ఒక్కప్రార్థనవఱకు——

వీర:- ఇప్పటికే ఆలస్యమైనది (గొంతునులుమును)

నీ:- (లోపల) ప్రభూ ! ప్రభూ ! ఓప్రభూ.

వీర:- ఏమాధ్వని ? ఇంకను చావలేదా ? ఇంకను పూర్తిగ చావలేదా ? ఇట్టి క్రూరుడనైగూడ ఇంకను దయాళువుగనే ఉంటినా ? నిన్ను బాధలో ఎక్కువసేపుంచను-అది-అది-

నీ:- (లోపల) హాప్రభూ ! ప్రభూ ! తలుపు తలుపు !

వీర:- ఎవరక్కడ ?

నీ:- (లోపల) నీలను ! నీలను ! తమతో ఒక్కమాట !

వీర:- ఓ అదినీలాంబరి. (పెద్దగ) ఇప్పుడే! ఇప్పుడే! ఇది చచ్చినది. అది సత్యకు చావుచెప్పవచ్చినది. ఆ కేకలు పెద్దవగు చున్నవి. హా! ఏమియుకదలికలేదా? సమాధివలె నిశ్చల ముగా నున్నది. లోనికిరావచ్చునా అది? వచ్చుటమంచిదా? ఇదిమఱల కదలుచున్నట్లున్నదా? లేదు. ఏమిచేసిన బాగుం డును? నీల లోనికివచ్చినచో నాభార్యతో మాటాడితీరును. నాభార్య! నాభార్య! ఏభార్య? భార్యయున్నదా నాకు? హా ఎంతదుస్సహము! ఎట్టికాళరాత్రి! నాకుజూడ ప్రళయముగ ఇప్పుడే సూర్యచంద్ర గ్రహణములొకే పారిగావచ్చినందున ఈ చెదరిపోయిన భూగోళము ఇట్టి తారుమారువంక బెగ్గడిలి నోరు తెఱచుకొనినట్లున్నది.

నీ:- (లోపల) హా ప్రభూ! మీతో అవశ్యము మాటాడవలె.

వీర:- ఓ నీమాటమఱచితిని. లోపలికిరా నీలా! ఆగు. ఇపుడేవత్తువుగాని- నేనీ తెరలు దింపివేయుదును. ఎక్కడ?—

ప్రవేశము: నీలాంబరి,

ఏమి ఇప్పటి విశేషములు?

నీ:- ఓ నాప్రభూ! అక్కడ ఘోరహత్యలు జరిగినవి.

వీర:- ఏమిటి? ఇప్పుడు?

నీ:- ఇప్పుడే ప్రభూ!

వీర:- అది కేవల చంద్రచారములోనిదోషము, అతడు హద్దుమీఱి భూమికిమఱింత డగ్గరిమనుష్యుల కున్మాదము

కల్పించుచున్నాడు.

నీ:- సత్యకుడు ప్రభూ! నటేశమను నొక కటకష్ట యుజకుని జంపినాడు.

వీర:-సత్యక నటేశులు చచ్చిరా?

నీ:- సత్యకుడు చావలేదు.

వీర:- సత్యకుడు చావలేదు? అట్లగుచో హత్యలో రసమేపోయి కమ్మని కసి, వెగటుగ మారుచున్నది.

ప:- (హీనస్వరముతో) నిష్కారణముగ చంపబడితిని.

నీ:- అయ్యో అయ్యో ఏమి ఏడుపది?

వీర:- అది? ఏది?

నీ:- అయ్యో! అయ్యో! నాదేవి కంఠధ్వనియే బాబో! బాబో! రక్షింపుడు. దేవి మఱలమాటాడుము. ప్రియపద్మా! ఓ బంగారుతల్లీ! మఱల ఒక్కసారి మాటాడు.

ప:- (హీనముగ) అన్యాయపుచావు చచ్చుచున్నాను.

నీ:- ఆ? ఆ? ఎవరింతపనిచేసినది.

ప:- (హీనముగ) ఎవరునులేదు నేనే. సెలవు. నన్ను మఱువకుడని దయాళుడగు నాప్రియునకు జెప్పు—సెలవు. (గుఱకతో చచ్చును)

వీర:- ఏమి? ఎట్లుచంపబడియుండును?

నీ:- అయ్యో ఎవ రెఱుగుదురు.

వీర:- తనకుతానే అని చెప్పగావింటివిగా! ఆపనినాది కాదు.

నీ:- ఆమె అట్లే చెప్పినది !— నేనవశ్యము నిజము తెలియజేయవలె.

వీర:- అది ఘోర, అనృతవాదివలె తప్ప రౌరవమున కేగినది. నేనే దానినిచంపినది.

నీ:- అయ్యో ? అయ్యో ! ఆమె దేవతామూ ! నీవొక నల్లని కొంటపిడయ్యావు.

వీర:- అది బుద్ధితక్కువపనికి దిగినది. అది ఒక చెడిపె.

నీ:-ఆమెపై అబద్ధముచెప్పుచున్నావు, నీవు, ఒకరాకాసివి.

వీర:- అది నీరువలె నిలుకులేనిది.

నీ:- ఆమెనిలుకులేదనిచెప్ప నీవు నిప్పువలె మండువాడవు. ఆమె ఒకసత్యదేవత !—

వీర:- న్యాయములగు హేతువులులేక నేనీ అత్యాచారమునకు గడగియుండినచో నాకు నవవిధనరకములలోగూడ చోటులేకుండుగాక. నీభర్త అంతయు ఎరుగును.

నీ:- నాభర్త ?

వీర:- నీభర్త ?

నీ:- ఆమె పాతివ్రత్యమునకు దప్పినదని ?

వీర:- అవును. సత్యకునితో.- లేక అదియే నిష్కళంకమై యుండినచో, దైవము నాకొఱకు ప్రత్యేకమరకతమయ ప్రపంచము నిర్మించి ఇచ్చినను దానినివదలను.

నీ:- నాభర్త ?

వీర:- అవును. అతడే నాకు మొదట జెప్పినది. అతడు

కడువిశ్వాసపేయుడు. ఇట్టిపాపములపై సోకినగాలినిగూడ సహింపని యోగ్యుడు.

నీ:- నాభర్త ?

వీర:- ఎందుకని మఱల మఱల అదే చఱచియడుగుచుంటివి సాధ్వీ ? నీభర్తయే అని చెప్పుచున్నాను.

నీ:- ఓ తల్లీ ! దుర్మార్గము నిష్కళంకప్రేమను పరిహాసించినది. ఆమె ద్రోహిఅని నాభర్తచెప్పుట ?

వీర:- అతడే సాధ్వీ ! నీభర్తయే అని చెప్పుచుంటిని ఆపదమర్థమైనదా ? నాకుమిత్రుడు. నీభర్త. విశ్వాసనీయుడు విశ్వాసనీయుడగు మేధావి-

నీ:- అతడట్లుచెప్పుచో దుష్టమగు వాని ఆత్మ దినమున కణువంతున కుళ్లి చివికిపోవలె. అది ఘోరమగు అబద్ధము. తుచ లేకిసంబంధముమీాద పాపమీామె కెంతమక్కువో !

వీర:- ఆ ! ఏమి ? జాగ్రత !-

నీ:- నీవేమిచేసిననుసరే. నీవామె కెంతగా తగియుంటివో నీ ఈకృత్యము దైవమునకుగూడనంతే——

వీర:- నెమ్మదిగ- అఱవకు-

నీ:- కీడుపొందుటకు నాలోగలశక్తిలో సగమైనను హానిచేయుటకు నీలోలేదు. ఓ టక్కరీ ! ఓ మొద్దూ ! జ్ఞానశూన్యుడా ! ఎట్టికృత్యముచేసితివి ! నీకత్తి నాకోకగడ్డిపోచ. నావి నూరుప్రాణములు పోయిననుసరే నిన్ను నలుగురిలో పెట్టెద. రక్షింపుడు ! రక్షింపుడు ! ఈ పాండ్యుడు దేవిని

చంపినాడా. కూనీ ! కూనీ !—

ప్రవేశము: రామరాయలు, మేధావి, సౌవర్ణి, ఇతరులు

రామ:— ఏమిరా అఱపులు ? ఏమిది సేనానీ !

నీ:— వచ్చితివా నాధా ! అందఱు తమ హత్యలను నీనెత్తిపై వేయునట్లు చక్కగచేసితివి.

సౌ:— ఏమిప్పుడు ?

నీ:— నిశ్చయముగా మనుష్యుడవే అగుదో ఈదుష్టుని కాదని ఖండింపుము. తనభార్యచెడుదని నీవుచెప్పినట్లు చెప్పు చున్నాడు. నీవట్టిపాపివి కావని, అట్లుచెప్పవని, నాకు తెలియును. చెప్పు ! నాకు దడదడగానున్నది.

మే:— నాకుతోచినదిచెప్పితిని. అతడున్యాయముగచూచి యుక్తమును యథార్థముకు అని తలచినదానికిమించి ఏమియు చెప్పలేదు—

నీ:— అయితే, ఆమెచెడుదని వీనితో ఎప్పుడైన చెప్పి యుంటివా ?

మే:— చెప్పితిని.

నీ:— ఘోరమగు అబద్ధముచెప్పితివి. నింద్యమును పాప మును అగుఅబద్ధము. అట్లుచెప్పుట నీకేఅవమానకరము. మన స్వామినిగ కేవల మభూతకల్పన. సత్యకునితోనా చెడ్డది ? సత్య కునితో ననియే అంటివా ?

మే:— సత్యకునితోనే-పో-వెళ్లు-నోరుమూసికో—

నీ:— మూసికోను. మాటాడితీరవలె. ఇచట నాతల్లి

నిర్జీవపడియున్నదే!

అంబలు:- సాహసము క్షమింపఁగాక.

నీ:- మఱి నీచాశలే కొంపదీసినవి.

వీర:- ఎందుకు? మీరందఱిట్లాశ్చర్యపడకుడు. ఇది సత్యాసత్యమధ్యమార్గికి—

శా:- అది విపరీతసత్యము.

రాఘ: మహారాక్షసము.

నీ:- మోసము. మోసము. మోసము! పొడకట్టుచున్నది. వాసనవేయుచున్నది! ఓదుర్మార్గము! అప్పుడే అనుకొంటిని! దుఃఖముకొలది నేనేచంపుకొందును. ఓ మోసము! మోసము!

మే:- నీకు పిచ్చెత్తినదా? ఇంటికిపోదువా పోవా?

నీ:- ఇచటిపెద్దలందఱును మాటాడుటకునాకు సెలవొసంగవలె. వీనికి విధేయత చూపవలసినదేకాని ఇప్పుడుమాత్రము కాదు. ఒకవేళ నేనింటికిపోనేపోను. —

వీర:- ఓ, ఓ, ఓ, (పక్కపై బడును)

నీ:- కాదు ప్రపంచమున కన్నుతెఱచిన జీవులలో అమాయికపు మధురమూర్తిని జంపుకొంటివిగాన క్రిందదొర్లి బొబ్బలెత్తు—

వీర:- (లేచును) అది ఒకముఱికికుంట. మిమ్ముగలను సౌవర్ణి మహాశయ! అంతగ ఎఱుగను. నిశ్చయముగ ఈహస్తములే ఆపిన ఊపిరిగల మీపుత్రి అదిగోపడియున్నది ఈ

కృత్యము క్షౌరముచేతో చూసనని నాకు తెలియును.

సా:- అమ్మా పద్మా! నీతండ్రిపోయినందు కెంతయు సంతసమగుచున్నది. నీ వివాహమతనికి మరణాంతకమై కేవల మాదుఃఖమే అతని వృద్ధజీవితతంతును రెండుగ కత్తిరించినది. ఇప్పుడతడే బ్రతికియుండినచో, ఈదృశ్యమతనిచే నెట్టిసాహస ములు చేయించియుండెడిదో!—

కీర:- మహావిచారము. కాని, ఒకవేయిసార్లు ఇది సత్య కునితో ఆచీకటితప్పని కొడిగట్టినన్నసంగతి మేధావికి చక్కగ తెలియును. నిజమని సత్యకుడును ఒప్పుకొనెను. ప్రథమమున దానికిచ్చిన నాప్రేమచిహ్నమును సత్యకునితనియింపులకు మెచ్చి వానికి బహుమాకృతి ఇచ్చినది. వానిచేతిలో దానిని చూచితిని. ఆ రుమాలు నా తండ్రి నా తల్లికివచ్చిన అనాదిలాంఛనము.

నీ:- ఓ దైవమా! ఓ స్వర్గదేవతలారా!

మే:- ఇదిగో మూసికో-నోరు.

నీ:- ఆగదు. ఆగదు. నోరుమూయను. ఆగను పడమటి టిగాపువలె తీక్ష్ణముగ విజృంభింతును. దేవతలు! రాక్షసులు! మనుష్యులు! పిశాచములు! అందఱు ఛీ అనుగాక. ఆగను చెప్పితీరెదను.

మే:- బుద్ధిగలిగిపో ఇంటికి.

నీ:- పోను (మేధావి నీలను పొడువబోవును)

సా:- ఛీ! ఆడుదానిపైననా నీకత్తి.?

నీ:- ఓమందమతీ! నీవుచెప్పిన ఆరుమాలు విధివశమున

నాకు ద్రోహకినది. ద్రోంగిలియైనను తెచ్చిపెట్టునని—అట్టిస్వల్పమునకు అర్హమగుదానికంటె పదిరెట్లధికముగ బతిమాలుటచే దానిని నాభర్తకిచ్చితిని.

మే:- ఓసీ తార్పులదానా ?

నీ:- ఆమె సత్యకునకిచ్చినది! లేదు. అయ్యో! అయ్యో! ఎంతఘోరము. నాకదిద్రోహకినది. నేను నాభర్తకిచ్చితిని.

మే:- అబద్ధములు చెప్పుదువటే లుచ్చా !

నీ:- దైవసాక్షిగలేదు. ఓ కటికమొద్దా ! అట్టిమంచి ఇల్లాలితో ఇట్టిమూఢుడేమిచేయగలడు.

వీర:- ఉఱుమునప్పుడు పడునవి తప్ప మేఘములో ఇక రాళ్లులేవా ? ఓరీ ప్రశస్తపుపాపీ ! (మేధావిపై కుఱుకును. మేధావి నీలను పొడిచిపోవును.)

సౌ:- ఆమె పడిపోవుచున్నది. వాడు చంపనే చంపినాడు.

నీ:- అవును. నన్ను మాదేవిప్రక్కన చేర్పుడు.

సౌ:- వాడు పాఱిపోయినాడు. ఈమెచచ్చుచున్నది.

రామ:- వీడొకపేరు పడ్డకిలాడీ. నేనిక్కడ పాండ్యునొద్ద నుండి లాగిన ఈకత్తిని మీరుతీసికొనుడు. రండు ! వెలుపల వాకిలి కాయుడు. వానినిదాటనీకుడు. అంతగనైనచో చంపుడు. వీడొక లోకకంటకుడగు దుండగీడు. వాని వెంబడించి పట్టుకోవలె. (రామరాయిలు, సౌవర్ణి పోదురు.)

వీర:- నాలో శౌర్యమేమియులేదు. ప్రతిఅల్పపుశిఖండి

కూడ నాకత్తిని లాగగలను. మంచిపోయినపిమ్మట నాకుగౌరవ మెందుకు? అదంతయుపోయినను—

సీ:— నీ గీతము దేనినిసూచించినది దేవీ! నీ పాటచే ఆలాపించుచుంటిని. ఓపాండ్యా! ఆమె పతివ్రతారత్నమురా!— నిన్ను నిజముగా ప్రేమించినదిరా కిరాతా! సత్యము చెప్పి నాకుస్వర్గములభించుగాక. చచ్చుచుంటిని! చచ్చుచుం టిని— (చచ్చును.)

వీర:— ఈగదిలో నాకు మఱొకఖడ్గమున్నది. అది విష దిగ్ధము. ఓ! అది ఇచటనేగలదు. మామా! నేనికవత్తును.

సా:— (లోపల) అందుకుయత్నించితివో అది నీకూరక పోదు. నిరాయుధుడవు. శాస్త్రపొందకు.

వీర:— నావంకచూచి మాటాడు. ఉత్తవాడనైకూడ నిన్ను కొట్టగలను.

పునఃప్రవేశము: సావర్ణి.

సా:— ఏమి నీయాగడము?

వీర:— ఇదిగో నాయొద్దకత్తి. ఇంతకుమించి మంచిది ఎన్నడును ఏవీరుని భుజపీఠమును అలంకరించి యుండలేదు. ఈ ఖడ్గరాజముధరించిన ఈచిన్నచేతితో నేను మీబోటి అయిదు గురుసైంధవు లడ్డగించినను పద్మవ్యూహమును భేదించుకొని పోయిన దినములున్నవి. అది వ్యర్థపుటాత్మస్తుతి. వానివిధి నెవ డాపగలడు. కాని ఇపుడట్లుగాదు. ఆయుధమున్నదనిభయపడకు. నా యాత్రాగమ్యస్థాన మిచటనేయున్నది. మీరుభయచకి

తుడై మఱలుదురా? అది నిరర్థకభయము. పూచికపుల్లతో నైనను వీరసేనుని ఆత్మకు గుఱిపెట్టి తేచాలు అతడుతగ్గును. వీరసేనుడెచటికేగును? ఇపుడెట్లు కన్పించుచుంటివి? ఓదుర్భాగపుదానా! నీగాగరవలె వెలవెలబోవుచుంటివా? ధర్మదేవత విచారణలో మనముకలిసినప్పుడు ఈ నీ చూపు నా ఆత్మను పిశాచములుపట్టి పీకుటకు విసరివేయుగాక. నీ పాతివ్రత్యమువలె వెల్లనైతివా? నికృష్టకిరాతా! ఓపిశాచగణమూ! ఈ స్వర్గీయదృశ్యము చూడకుండునట్లు నన్ను చావమోదుడు! ప్రళయవాయువులలోనికూదుడు. గంధకములో పక్వముచేయుడు. బాడబము ద్రవరూపమై యున్నపుడు నిటాలుగానున్న అఖాతములలో ముంచుడు! ఓపద్మా పోతివా! ఓపద్మా ఓ, ఓ, ఓ——

పరివేశము: కుర్చీలో సత్యకుడు, విజయమూర్తి, రామరాయలు బంధీయగు మేధావి, ఉద్యోగులు.

విజ:- ఏడీ ఆతనితోందరపాటు దుష్టుడు?

వీర:- వాడు వీరసేనుడే. ఇచటనే ఉన్నాడు——

విజ:- ఆవిషసర్ప మెచటనున్నది? ఆకిరాతునిముందుకు తెండు.

వీర:- వానిపాదములవంకనే చూచుచుంటిని. దవ్యములకడ్డ కాళ్లుంచుచు కట్టుకథలు ఉత్తపి. నీవొకదయ్యమవే అగుచో నిన్ను చంపలేనురా. (మేధావిని గాయపఱచును)

విజ:- వానిబాకును లాగుడు.

మే:- నాకురక్తమేగాని చావురాలేదు.

వీః:- అందుకు చింతింపను. నాదృష్టిలో చావే సుఖ తరముగనుక నీవ్రు(బతుకుటే నాకిష్టము.

విజ:- వీరసేన! ఒకప్పుడంత మంచివాడవగునీవు పాడు బాసిన తంత్రమున బడితివే నిన్నేమనవచ్చు ?

వీర:- ఏమి? ఏమైనను. క్రోధమునకై గాక గౌరవమునకై చేసితిగనుక మీకిష్టమగుచో ఒకగౌరవార్హుడగు హంతకుడని.

విజ:- ఈతుచ్ఛుడు తన కుతంత్రమును కొంతవఱకొప్పు కొనినాడు. నీవును వాడును సత్యకవధకు, అంగీకరించిరా?

వీ:- అవును.

ర:- ప్రియసేనానీ! నేనట్టి కారణమెపుడును కలిగించి యుండలేదే.

వీర:- నిజమే. అందుకు నీపాదమంటుచున్నాను. కాని నాప్రార్థన మంగీకరించి నాదేహాత్మలపై తానేల వలపన్నెనో ఆ అరదయ్యాము నడుగుము.

మే:- నన్నేమియు అడుగకుడు. మీకుతెలిసినది తెలిసి నది. ఈక్షణమునుండి పెదవి విప్పను.

సా:- చిత్రవధలే విప్పును.

వీర:- మంచిపని.

విజ:- ఇచటజరిగినది మీకు తెలిసియుండును. ఆచచ్చిన నటేశము చొక్కాలో ఒకయుత్తరము దొరకినది. ఇచట మఱొకటి—వానిలో ఒకటి సత్యకవధకు నటేశము పూనవలసి నట్లు చెప్పుచున్నది.

వీర:- ఓరీదుష్టా! దుష్టా!-

స:- ఘోరాతి ఘోరము.

విజ:- ఇంకొక జాబుకూడ అతనివద్ద నేదొరికినది. దీనిబట్టి నక్షత్రేశము, ఈయధోగతి కుంకను కడతేర్పనుద్దేశింప, ఇంతలో వీడువచ్చి వానిపని పూర్తిచేసినట్లు తోచుచున్నది.

వీర:- ఓరీ అధోగతిపాపీ! అయితే సత్యక! నాభార్య రుమాలు నీకెట్లు వచ్చినది?

స:- నాగదిలో దొరకినది. తనకోర్కె సఫలము చేయగల ప్రత్యేక కార్యమునకై అచట జారవిడిచినట్లు ఇంతకుముందే తనే ఒప్పుకొనినాడు.

వీర:- ఔర! దొంగ దొంగ! కుక్కలుముట్టనిపీనుగ

స:-ఇంకను నక్షేశుని యుత్తరములలో కావలి నాటిరాత్రి నన్ను ధిక్కరించునట్లు తన్ను వీడెట్లుసిగొల్పెనో—నాకు పదచ్యుతి ఎట్లయ్యెనో—అంతయు వాడుతిట్టుచువ్రాసెను. ఎందుకు చాలసేపు చచ్చినట్లుపడియుండి నక్షేశము–, తన్ను ప్రేరేచి మేధావియే తన్ను చంపినట్లు, అరచి చచ్చెను.

విజ:- (వీరసేనునితో) నీవీగదివదలి మాతో రావలె. ఉద్యోగములు నీనుండి తొలగింపబడినవి. సుమిత్రాను సత్యకు పాలించును. ఇక ఈగాడిదవిషయములో వీని నధిక కాలము చిత్రవధలో నుంచి వేదనగల్పింపగల జిత్తులమారి యోచనలు లున్నచో, అవన్నియు సత్యకునివే. నీ నేరస్వభావము ప్ర

త్వముస కెఱుకపఱవి, పైయుత్తరువు వచ్చువఱకు నీవు మాబం
దిగా నుండవలె. వాని దెంము !

వీర:- కొంచెమాగుడు. మీారు పోకపూర్వ మొకటిరె
రెండు, నూటలు. ప్రభుత్వమునకు కొంత సేవజేసితిని. అదివారికే
తెలియును. ఇప్పుడది అనవసరము. ఈ దురదృష్టకృత్యములను
నివేదించునపుడు నన్ను ఉన్నరీతిగనే మీాయుత్తరములలో నివే
దింపుడని నామనవి. జుగుప్సాబుద్ధితో పెంచిగాని, దయా
దృష్టితో త్రుంచిగాని వ్రాయకుడు. ఇంకను.—

సీ॥ ఎవడు, నేరపులో,నగువిధాన గాక, యమాయికప్రేమను, నఱగివాండో
ఎవడు.ద్రోహముతో, కలవర మెందు, డుగ, జేయబడ,కూడక, సందియాం పడండో

ఎవనిమూర్ఖపుచేయి, యవనిలోలేని, వజ్రము, తృణంబట్లు. విసరివయి చెనో

ఎవడిబ్బడిగ, భావిభవమున, నీతన సతి, యొప్పకయును,మగతులెగోశె,

తే॥ ఎవనిలోంగిన కనుదోయి. యిట్టిజాల్ద్ర, వించుతటి వ్యర్థమయ్యెను వేడి బిందు
వులను రాల్చ దీపంపువత్తుల విధాన, నశ్రువులరాల్చె నెటిగింపు డయ్యా!వాని.

దానితో ఇదికూడ చెప్పుడు. ఒకప్పుడు మలేయాలో, శిరో
వేష్టన లక్షితుడును, ద్వేషశీలియు, నగు నొకతురుష్కుడు
కటకపు పౌరునొకనిగొట్టి ప్రభుత్వమును నిందింప, నేను ఆను
న్నతిగానిని పీకతోపట్టి చంపినదిల్లని. (పొడుచుకొనును)

విజ:- మృత్యుయుగము: మృత్యుయుగము!

సా:- అనుకొన్నదంతయు పాడైనది.

వీర:- చంపుటకుముందు పద్మా! నిన్ను ప్రేమించితిని ప్రేమపై చచ్చుటకే చంపుకొంటిని. (ప్రక్కపై చచ్చున

స:- అతడఖీనూన ధనుడగుటచే ఇట్లగునో అని భయ పడిగూడ, నిరాయుధుడుగదా, అనుకొంటిని.

విజ:- (మేధాపీతో) ఓరీ మిత్రద్రోహీ! యాతనకన్న ఆకటిమంటకన్న, పారావారముకన్న, అతిదారుణముర్రా చూడు! శయ్యయొక్క శవభారమును!- ఇదంతయు నీకృషి. ఈ వస్తుచయము దృష్టికి విషము తెచ్చిపెట్టుచున్నది. వాని కప్పుడు. సౌవర్ణి! వారసుడవు నీవేగనుక పాండ్యుని వస్తుసం దల సధీనముచేసికొని, గృహారక్షణముననుండుము. రాష్ట్రపతీ! ఈ ఘోరపాపికి చేయవలసిన ప్రాయిశ్చిత్తములు, చిత్రవధలు— అన్నియు ఇకనీయందున్నవి. నేనిపుడేపోయి ప్రభుత్వమున ఘోరకృత్యములను భారహృదయముతో నివేదింతును. "లోక శోకహాతంచ సమస్తం-" (తెరపడును)

## భరతవాక్యము

మ॥ వనితాలోకము ముక్తిజెందుటకు సోపానమ్మౌ, సత్సంతతిజ
గన మూలమ్మౌ, గుణాగ్రగణ్యము, సమాజ్ఞాబీజముల్, మస్త్యజా
తిని సభ్యన్నతి నొందజేయదగు పాతివ్రత్య, మీభారతా
వనిలో వెలెడుస్త్రీస్తోత్రములు ప్రాప్తంబైనసుల్, నిచ్చలున్.

